Photo by : DEVIDAS KASBEKAR




READY FOR THE RITUAL

## Statement about ownership of CHANDAMAMA (Telugu)

*Rule 8 (Form VI), Newspapers (Central) Rules, 1956*

| | | | |
|---|---|---|---|
| 1. | *Place of Publication* | .... | 'CHANDAMAMA BUILDINGS' 2 & 3, Arcot Road Vadapalani, Madras-600 026 |
| 2. | *Periodicity of Publication* | ... | MONTHLY 1st of each calendar month |
| 3. | *Printer's Name* | ... | B. V. REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | Prasad Process Limited 2 & 3, Arcot Road, Vadapalani, Madras-600 026 |
| 4. | *Publisher's Name* | ... | B. VISWANATHA REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | CHANDAMAMA PUBLICATIONS 2 & 3, Arcot Road Vadapalani, Madras-600 026 |
| 5. | *Editor's Name* | ... | NAGI REDDI |
| | *Nationality* | ... | INDIAN |
| | *Address* | ... | 'CHANDAMAMA BUILDINGS' 2 & 3, Arcot Road Vadapalani, Madras-600 026 |
| 6. | *Name & Address of individuals who own the paper* | ... | CHANDAMAMA CHILDREN'S TRUST FUND BENEFICIERIES: 1. B. V. HARISH 2. B. V. NARESH 3. B. V. L. ARATI 4. B. L. NIRUPAMA 5. B. V. SANJAY 6. B. V. SHARATH 7. B. L. SUNANDA 8. B. N. RAJESH 9. B. ARCHANA—all minors by Trustee M. UTTAMA REDDI 9/3, V.O.C. Street Madras-600 024. |

I, B. Viswanatha Reddi, hereby declare that the particulars given above are true to the best of my knowledge and belief.

**B. VISWANATHA REDDI**
*Signature of the Publisher*

*1st March 1976*

# చందమామ కేమెల్ రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు



**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు




12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి. చందమామ: డాల్టన్ ఏజెన్సీస్, వడపళని, మద్రాసు 600 026. ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

పేరు______________________________వయస్సు__________

అడ్రసు________________________________________________

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 20–3–1976

VISION

CONTEST NO.1

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

# స్త్రీ జన పక్ష పత్రిక వనిత ఏమేమి చెబుతుంది?

| | | | | |
|---|---|---|---|---|
| పదిమందికీ ఉపయోగపడే విషయాలతో వెలువడుతున్న ఏకైక స్త్రీ జన పక్ష పత్రిక! | విడిప్రతి ఒకరూపాయి | | అందాన్ని ఎలా కాపాడుకోవాలి? ఎలా పెంపొందించుకోవాలి? — చెబుతుంది. | మీ వూరి పత్రికల దుకాణంలో 'వనిత' దొరుకుతుంది— అడగండి. |
| | గొప్పవారు ఎలా గొప్ప వారయ్యారు? వారి ఉద్దేశాలు, ఊహలూ వివరిస్తుంది. | గొప్పవారితో 'గోష్ఠి' కార్యక్రమాలు నిర్వహించి, అందులోని సారాన్ని అందజేస్తుంది | విడిప్రతి ఒకరూపాయి | |
| రకరకాల బొమ్మలు చెయ్యడం, ముగ్గులు వెయ్యడం వివరిస్తుంది. | కథలు చెబుతుంది; కవిత వినిపిస్తుంది! | నిత్యం అవసరమయ్యే చిన్న చిన్న చిట్కాలు చెబుతూ, సహాయపడుతుంది! | అప్పుడే పదిహేడు సంచికలు వెలువడ్డాయి- ఇవన్నీ పదికాలాలపాటు చెప్పుకోదగ్గ విషయాలు చెప్పాయి. | సం॥ర చందా ఇరవై నాలుగు రూపాయిలు |
| 'వనిత' కేవలం కాలక్షేపానికి మాత్రమే పనికొచ్చేపత్రిక కాదు! | విడిప్రతి ఒకరూపాయి | సం॥ర చందా ఇరవై నాలుగు రూపాయిలు | | 'వైద్య సలహాలు' పేరిట అనారోగ్యానికి సంబంధించిన ఎన్నో సందేహాలను నివృత్తి చేస్తుంది! |
| పదిమందికీ ఉపయోగపడే విషయాలతో వెలువడుతున్న ఏకైక స్త్రీ జన పక్ష పత్రిక! | | కుట్లు, అల్లికలు, ఎంబ్రాయిడరీలు వంటివన్నీ 'ఉపాధ్యాయిని'లా బోధపరుస్తుంది | అందుకే 'వనిత'ను ఇంటిల్లిపాదీ మెచ్చుకుంటున్నారు. | అందుకే 'వనిత' అందరికీ అప్తురాలయింది! |
| ఎందరో 'వనిత' చదవడం తమ మంచి అలవాట్లలో మరొక మంచి అలవాటుగా భావిస్తున్నారు. | మీ వూరి పత్రికల దుకాణంలో 'వనిత' దొరుకుతుంది— అడగండి. | లేదంటే-'వనిత' కార్యాలయానికి రాయండి! | వనిత<br>చందమామ బిల్డింగ్స్<br>మద్రాసు - 26 | |

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళ కథ ["తగిన వధువు"] కు ఆధారం ఎం. కామేశ్వర రావు రచన. కొందరు మనుషులు తీవ్రమైన తృష్ణలు కలిగి ఉంటారు— ఒకరికి ధనదాహం; ఒకరికి కీర్తి దాహం: ఒకరికి అధికార తృష్ణ; ఒకరికి సౌందర్య పిపాస. అయితే ఈ తృష్ణలు అన్నప్పుడల్లా, అందరికీ తీరవు. అవి తీరటానికి తగిన పరిస్థితులు ఉండాలి; తీర్చుకోవటానికి తగిన శక్తి సామర్థ్యాలుండాలి. ఇదే మనం బేతాళకథలో చూస్తాం.

సంపుటి 59 మార్చి '76 సంచిక 3




CHITRA



## 33

దక్షిణదేశంలో మహిళారూప్య నగరం సమీపంలో ఉండిన మహారణ్యంలో ఒక విశాలమైన వటవృక్షం ఉండేది. దాని మీద ఉండిన అసంఖ్యాకమైన పళ్ళను వేలాది పక్షులు తినేవి. దాని నీడ కింద ఎంత మంది బాటసారులైనా విశ్రమించ టానికి చోటు ఉండేది. దాని ఊడలు ఎంతో మేరదిగాయి. దాని ఆకుల మధ్య ఎన్నో రకాల పక్షులు గూళ్ళు కట్టు కున్నాయి. దాని కొమ్మల మీద అనేక కోతుల సమూహాలు నివసించేవి. దాని పూల తేనెలను అంతులేని తేనెటీగలు పట్టుకుపోయేవి.

ఆ మహావృక్షం మీద లఘుపతనకం అనే కాకి నివసిస్తూ ఉండేది. ఒకనాడు అది ఆహారం కోసం మహిళారూప్య నగరం కేసి పోతూ ఒక బోయవాణ్ణి చూసింది. వాడు నల్లగానూ, క్రూరం గానూ ఉన్నాడు. వాడి చేతిలో వల ఉన్నది. వాణ్ణి చూసి కాకి, "ఈ దుర్మా ర్గుడు నే నుండే వటవృక్షం వైపే పోతు న్నాడు. అక్కడ వాడు తప్పక పక్షుల్ను పట్టుతాడు. పాపం, వాటిగతి ఏమి కానున్నదీ తెలియదు. ఏమైనా నేను వాటిని కాపాడాలి," అనుకున్నది.

ఇలా అనుకుని ఆ కాకి వెనక్కు తిరిగి వెళ్ళి, పక్షులన్నిటితోనూ ఇలా చెప్పింది:

"వలా, బియ్యపుగింజలూ తీసుకుని ఒక బోయవాడు ఇటుగా వస్తున్నాడు. మీరు ఆ దుర్మార్గుణ్ణిగాని, వాడు వేసే బియ్యాన్నిగాని నమ్మకండి. వాడు వల వేసి, బియ్యం చల్లుతాడు. ఆ బియ్యాన్ని మీ రందరూ విషం కింద భావించి, వర్జించండి."

అట్ట చివరి బొమ్మ



బోయవాడు వటవృక్షం వద్దకు వచ్చి, వల పరిచి, బియ్యంగింజలు చల్లాడు. తరవాత వాడు కొంతదూరం వెళ్ళి, ఒక చోట దాగి, వల వేసి చూడసాగాడు. కాకి ముందుగానే హెచ్చరించి ఉండటంచేత, పక్షులన్నీ రహస్యంగా దాక్కున్నాయి.

కాని కొద్ది సేపటికల్లా చిత్రగ్రీవ మనే పావురాల రాజు, తన వెయ్యిమంది అను చరులతో సహా, ఆహారం వెతుకుతూ అటుగా వచ్చింది. దూరాన ఉండగానే వాటికి బియ్యపుగింజలు కనపడ్డాయి. అవి వాటి కేసి ఎగురుతూ వచ్చాయి. కాకి వాటికి ప్రమాదం గురించి హెచ్చరిక చేసింది. కాని లాభం లేకపోయింది. జిహ్వ చాపల్యంతో పావురాలన్నీ బియ్యపు గింజల పైన వాలి, వలలో చిక్కుకు పోయాయి. అజ్ఞానంలో ఉంటూ, జిహ్వ చాపల్యానికి గురి అయే ప్రాణులు, చేపల లాగా ఆకస్మిక మరణానికి గురికావటం తప్పదు గదా! అంతమాత్రాన పావు రాలను తప్పు పట్టనవసరం లేదు. మానవ జాతికి దురాశ సహజమేగద! లేకపోతే, రావణుడి వంటి దైవభక్తుడు ఇతరుడి భార్యను అపహరించటం పాపమని ఎందుకు గ్రహించకపోవాలి? దైవస్వరూపుడైన రాముడికి బంగారులేడి అసంభవమనీ, అది మాయ అనీ ఎందుకు తెలియకపోవాలి? ధర్మపరుడైన యుధిష్ఠిరుడు పాచికలాడి అకస్మికంగా తన సర్వస్వమూ ఎందుకు పోగొట్టుకోవాలి? తన మనస్సును ఏదైతే ఆకర్షిస్తుందో దాని వెనక దాగి ఉండే ప్రమాదాన్ని మనిషి గుర్తించలేక పోతాడనుకోవాలి. లేదా, అపాయం కలగటం తప్పనిసరి అయిన క్షణంలో విధినిర్ణయం వల్ల మేధావంతులకు కూడా బుద్ధి పెడతల పట్టుతుందని అనుకోవాలి.

పావురాలు తన వలలో చిక్కుకు పోయాయని బోయవాడికి తెలిసింది.

బోయవాడు పన్నిన ఉచ్చులలో తన అనుచరులందరూ చిక్కుకు పోయిన

సంగతి గ్రహించి, చిత్రగ్రీవం వాటితో ఇలా అన్నది:

"విచారించి కుంగిపోకండి. ఆపదలో మనసును చిక్కబట్టుకున్న వాడు ఆ ఆపదను గడవగలుగుతాడు. బోయ వాడు వచ్చేలోపున, మన మందరమూ ఒకేసారి గాలిలోకి ఎగిరి, వలతో సహా ఆ దుర్మార్గుడికి కనబడకుండా వెళ్ళి పోదాం. అలా అయితేనే మనం బతికి పోతాం. అలాకాక మనం నిరాశ చెంది, కుంగిపోయి, తలా ఒక దిక్కుకూ ఎగిరి నట్టయితే మన అందరికీ, రెండు తలల పక్షి కథలో లాగ ప్రమాదం తప్పదు."

రెండు తలల పక్షి కథ

[ఒకప్పుడు రెండు తలల పక్షి ఒకటి ఉండేది. ఆ తలలు విరుద్ధదిక్కులుగా ఉండేవి. ఒకనాడు దాని ఒక నోటికి అమృతం అందింది. రెండో నోరు తనకు కూడా అమృతంలో భాగం ఇయ్యమన్నది. దానికి మొదటి నోరు ఒప్పుకోలేదు. అందుకని రెండో నోరు విషం కోసం వెతికి తిన్నది. ఆ విషం పక్షినీ, దాని రెండు తలలనూ కూడా చంపేసింది.]

పావురాల రాజైన చిత్రగ్రీవం ఈ విధంగా హెచ్చరించిన మీదట పక్షులన్నీ ఒక్కసారిగా, వలతో సహా, ఎగిరాయి.

బోయవాడు వాటి వెంబడి నేల మీద పరిగెత్తుతూ, "ఆ పక్షులు త్వరలోనే తమలో తాము కీచులాడుకోక మానవు. అప్పుడు అవి తప్పక నా వలతోసహా కింద పడతాయి," అనుకున్నాడు.

లఘుపతనకం (కాకి) ఆహారం కోసం వెతకటం కూడా మాని, వల వెనకగా తాను కూడా ఎగురుతూ వెళ్ళింది.

త్వరలోనే పావురాలు వలతో సహా బోయవాడికి కనబడనంత దూరం వెళ్ళి పోయాయి. వాడు నిరాశచేసుకుని, "రాసి పెట్టిలేనిది జరగదు. రాసిపెట్టి ఉన్నది ప్రయత్నం అవసరం లేకుండా దానంతట అదే జరుగుతుంది. నా కుటుంబానికి జీవనాధారంగా ఉండిన వల కూడా పోయింది," అనుకుని వెనక్కుమళ్ళాడు.





## 3

[జయశీలుడు ఒక రాత్రివేళ ఆర్తనాదాలు విని, నిద్రమేల్కొని, శ్మశానంలో ఒక వింత ఆకారం తల నరికి, సిద్ధసాధకుణ్ణి రక్షించాడు. తరవాత అతడు దాపులనున్న ఒక ఇంటికి పోయి, ఆ ఇంటి యజమానురాలైన వృద్ధురాలితో మాట్లాడుతూండగా, హిరణ్యనగర రక్షకుడు, యిద్దరు మనుములతో వచ్చి, తలుపు తెరవమంటూ కేకపెట్టాడు. తరవాత—]

నగర రక్షణాధికారి అంత రాత్రివేళ తన ఇంటికి వచ్చి, తలుపు తెరవమంటూ కేక పెట్టటం, వృద్ధురాలికి ఆశ్చర్యంతో పాటు, కాస్త భయం కూడా కలిగించింది.

వృద్ధురాలు తలుపు దగ్గిరకుపోయి, గడి తీయబోయినదల్లా ఆగి, జయశీలుణ్ణి, "నాయనా, నీవేదైనా పెద్ద నేరం చేసి, రాజభటులకు దొరక్కుండా పారిపోతున్న వాడివి కాదుగదా ?" అని అడిగింది.

"అమ్మా, అలాంటి నేరం చెయ్యలేదు. బతుకుతెరువు కోసం దేశాలు పట్టి తిరుగుతున్నవాణ్ణి. అంతే! ఈ మాట ప్రమాణం చేసి మరీ చెబుతున్నాను." అన్నాడు జయశీలుడు.

"నీ రూపు రేఖలూ, మాట తీరూ చూస్తూంటే, ఎంతో మర్యాదా, మన్ననా నేర్చిన వాడివిలా కనబడుతున్నావు. నిర్దోషికి రాజభటుల భయమేమిటి!"



అంటూ వృద్ధురాలు గడి తీసి, తలుపులు బార్లా తెరిచింది.

నగర రక్షకుడు ద్వారం గడప దాట కుండానే వృద్ధురాలిని, "అమ్మా, మీ భర్త గారు నాకు బాగా తెలుసు. ఇంత రాత్రి వేళ నిద్రాభంగం కలిగించినందుకు ఏమీ అనుకోకండి. కాటికాపరుల పెద్ద కొడుకూ, ఒక సిద్ధసాధకుడూ తగువు పెట్టుకున్న కారణంగా నేను రావలసి వచ్చింది. మీ ఇంటి కెవరైనా యువ కుడు—నడుముకు కత్తి వేళ్ళాడ కట్టు కున్నవాడు, వచ్చాడా?'' అని అడిగాడు.

వృద్ధురాలు ఏమని జవాబివ్వాలా అని తికమక పడుతున్నంతలో జయశీలుడు పక్కగదిలో నుంచి బయటికి వచ్చి, ''అయ్యా, మీరనే ఆ యువకుణ్ణి, నేనే అయివుండను గదా?'' అన్నాడు.

కాటికాపరి కొడుకు కీచుమంటూ అరిచి, "అయ్యా, యితడే చచ్చి బతికిన, నా తండ్రి తల నరికినవాడు,'' అన్నాడు.

సిద్ధసాధకుడు అతడి కేసి కోపంగా చూస్తూ, ''ఒరే, వెధవా! ఎన్నిసార్లు చెప్పేది? చచ్చిన మనిషి తిరిగి బతకటం ఎక్కడైనా కద్దా? ఈ యువకుడు చంపింది, నీ తండ్రి నావేశించిన మహా భూతాన్ని. ఆ సంగతి ఆ భూతం నోటంట, నే విన్నాను. ఇక నోరు మూసుకో!'' అన్నాడు.

''మీ యిద్దరూ తక్షణం నోళ్ళుమూసు కోకపోతే, యిప్పుడే మీ తలలు నరికి శ్మశానంలో పూడ్చి పెట్టిస్తాను,'' అని నగర రక్షకుడు సిద్ధసాధకుణ్ణీ, కాటి కాపరికొడుకునూ గట్టిగా కసిరి, జయ శీలుణ్ణి, ''నీ పేరేమిటి? ఎక్కణ్ణుంచి వస్తున్నావు?'' అని అడిగాడు.

''అయ్యా, నా పేరు జయశీలుడు, అమరావతీ నగరం వాణ్ణి. మా రాజుగారి పేరు రుద్రసేనుడు; వినేవుంటారు! నేను కొన్ని కారణాలవల్ల, ఆ నగరం వదిలి ఉద్యోగాన్వేషణలో యిక్కడికొచ్చాను," అన్నాడు జయశీలుడు.

నగరాధికారి సిద్ధసాధకుణ్ణీ, కాటి కాపరికొడుకునూ అతడికి చూపుతూ, "నువ్వు వీళ్ళను ఎరుగుదువా? నువ్వు శ్మశానంలో తన తండ్రిని హత్యచేశావని, యీ కాటికాపరి కొడుకు అంటున్నాడు. అందుకు నీ జవాబేమిటి?" అన్నాడు.

జయశీలుడు ఆ ఇద్దరి కేసీ ఓ మారు చూసి, సిద్ధసాధకుణ్ణి గుర్తించి, "అయ్యా, నేనీ సాధకుణ్ణి శ్మశానంలో చూశాను. కాల కాలుణ్ణంటూ ఒక వికృతాకారుడు యితణ్ణి వెంటబడి తరుముతుండగా; నేను అడ్డపడ్డాను. ఆ వికృతాకారుడు నా మీద కలబడబోయేంతలో, ఆత్మరక్షణ కోసం అతడి తల నరకవలసి వచ్చింది," అన్నాడు.

"నువ్వు కాలకాలుడి తల కాదు నరికింది, నా తండ్రి తల! ఆయన ఉదయం పూట చనిపోయినట్టు అందరూ అనగా శ్మశానానికి తీసుకు వచ్చాను. కట్టెల కోసం నేను దూరంగా పోయిన సమయంలో ఏ దేవత దయవల్లనో ఆయన బతికాడు. నేను తిరిగివస్తూ, నువ్వాయన తల నరకటం చూశాను," అన్నాడు కాటి కాపరి కొడుకు కోపంగా.

"ఒరే, ఆ శవం ఎవరిదో కూడా చూడకుండానే, నేను నా మంత్రశక్తితో, దానిలోకి కాలుణ్ణి ఆవాహన చేశాను. అప్పుడు



శవానికి ప్రాణం వచ్చింది. కాలుడిధాటికి తట్టుకోలేక నేను పారిపోతూండగా, యీ వీరయువకుడు వచ్చి, కాలుడి తల నరికి నన్ను కాపాడాడు," అన్నాడు సిద్ధ సాధకుడు మరింత కోపంగా.

నగరాధిగారి చిన్నగా నవ్వి, జయశీలుడితో, "నీ పేరు జయశీలు డని గదా చెప్పావు? సరే. ఈ యిద్దరూ నాలుగైదు గంటల నుంచి యిలా అర్థం లేకుండా మాట్లాడుతూ, నువ్వు తల నరికిన వాడెవడో, అంతుపట్టకుండా నా మతి చెడగొడుతున్నారు. ఇందులో ఏదో ధర్మసూక్ష్మం వున్నట్టు, నా కనుమానం కలుగుతున్నది....అంతా మంత్రిగారే



మయింది. వెంట రాజభటులు లేకుండా గుర్రం మీద పోతున్న అధికారినీ, వెనక వస్తున్న వాళ్ళలో జుట్టు విరబోసుకుని, నిలువెల్లా నల్లని దుస్తులు ధరించిన సాధకుణ్ణీ చూసి, రాజవీధిలోని జనం వింత పడసాగారు. సంగతేమిటో తెలుసుకునేందుకు తన దగ్గిరకు వచ్చిన జనంతో కాటికాపరి కొడుకు, "ఈ కత్తి వేళ్ళాడ కట్టుకున్న కుర్రవాడు చచ్చి బతికిన నా తండ్రిని చంపాడు. ఆ నల్ల దుస్తుల భూతంగాడు ఆ హంతకుడికి వంతపలుకుతున్నాడు. రాజుగారు వాళ్ళిద్దరి తలలూ, నా చేతే నరికించేయిస్తారు." అని చెప్ప సాగాడు.

నగరాధికారి వెళ్ళేసరికి, మంత్రి అప్పుడే రాజభవనం ప్రవేశించబోతున్నాడు. ఆయన అధికారి వెంట వున్న వాళ్ళను చూసి, సంగతి గ్రహించాడు. అధికారి ఆయనతో జరిగిన సంగతంతా చెప్పాడు.

మంత్రి కొంచెం సేపు ఆలోచించి, "వైద్యుడూ, బంధువులూ అంతా వచ్చి పోయినట్టు చెప్పిన కాటికాపరి తిరిగి బతకటం అసంభవం. సిద్ధసాధకుడు చెపుతున్నట్టు వాడి శరీరంలో, ఏ మహా కాలుడో ప్రవేశించి వుండాలి! ఏమైనా వాడికి ప్రాణం వచ్చి, లేచి నడిచాడు

చూసుకుంటారు. ఇక నా వెంటరండి." అంటూ దూరంగా ఒక చెట్టుకు కట్టి వేయబడిన తన గుర్రం కేసి నడిచాడు.

జయశీలుడు, వృద్ధురాలితో, "అమ్మా, సంగతి విన్నావు కదా? నేను నిర్దోషిని. మంత్రిగారో, రాజుగారో ఆ సంగతి తేలిగ్గానే గ్రహించగలరు." అన్నాడు.

"నీకు శుభం కలగాలి, నాయనా!" అంటూ వృద్ధురాలు చేయిఎత్తి జయశీలుణ్ణి దీవించింది.

ముందు గుర్రం మీద నగరాధికారీ, వెనగ్గా కాలినడకన జయశీలుడూ, సిద్ధసాధకుడూ, కాటికాపరి కొడుకూ నగరంలోకి ప్రవేశించారు. ఆ సరికి సూర్యోదయ



సిద్ధసాధకుడు ముందుకు వచ్చి, మంత్రికి నమస్కరించి, "అయ్యా, నాదొక చిన్నమనవి. చెప్పమని సెలవా ?" అన్నాడు.

మంత్రి చెప్పమన్నట్టు తలాడించాడు. సాధకుడు ఒకసారి గొంతు సవరించుకుని, "ఈ జయశీలు డనే యువకుడు మహా సత్వుల కోవకు చెందినవాడు. తల తెగిన కాలుడు, యీ యువకుడి ఖడ్గానికి అమోఘశక్తులు ప్రసాదించి, దీవించాడు ! ఆ మాట నేను విన్నాను. ఇతనివల్ల కనకాక్ష మహారాజుగారు లాభపడేందుకు చక్కని అవకాశాలున్నాయి." అన్నాడు.

మంత్రి విసుగుపడుతూ, "నువ్వనే దేమిటి ? కొడుకూ, కుమార్తే కనబడ కుండాపోయిన దిగులుతో వున్న రాజు గారు, యీ యువకుడి కత్తి సాయంతో రాజ్యాలు జయించటానికి బయలుదేర మనా ?" అని అడిగాడు.

"అయ్యా, అదికాదు నా సలహా. రాజుగారు తమ కుమార్తెనూ, కొడుకునూ వెతికి తెచ్చేందుకు, యీ జయశీలుణ్ణి పంపవచ్చు. ఆ పనిలో విజయం యితడు తప్పక సాధిస్తాడు. ఇతడికి మహాకాలుడి రక్షా, దీవనా, తోడ్పాటులు లభించగలవనే దాంట్లో ఎలాంటి సందేహమూ లేదు." అన్నాడు సిద్ధసాధకుడు.

గదా ? అలాంటివాణ్ణి, యీ యువకుడు తల నరికాడు ! అంటే, హత్య చేసినట్టే గదా ? కాని...." అంటూ ఆగి, ఏం అనేందుకూ తోచక తలపంకించసాగాడు.

అది అవకాశంగా తీసుకుని జయ శీలుడు, "అయ్యా, తక్కిన సంగతుల మాటేమో కాని, నేను ఆత్మరక్షణకోసమే అలా తల నరకవలసి వచ్చింది. ఆత్మ రక్షణా ప్రయత్నంలో ప్రత్యర్థిని చంపటం నేరం కాదుగదా !" అన్నాడు.

"అవును, ఆ మాటా నిజమే," అన్నాడు మంత్రి తలమీది నుంచి పెద్ద భారం దిగిపోయినవాడిలా పెద్దగా నిట్టూరుస్తూ.

ఈ మాటలు వినగానే మంత్రికి ఒక గడ్డుసమస్య చప్పున పరిష్కారమైపోయి నట్టు తోచింది. ఏళ్ళనిండి, కాలంమూడి చచ్చిన కాటికాపరి మరోచావు గురించి ధర్మసందేహాలతో కాలం వృథాచేయటం ఎందుకనుకున్నాడాయన. సాధకుడు చెప్పినట్టు, యీ జయశీలుణ్ణి, రాజుగారి పిల్లలను వెతక పంపటం బాగానే వుంటుంది....

ఇలా ఆలోచించి మంత్రి, వాళ్ళను అక్కడే వుండమని చెప్పి, రాజుగారిని చూడబోయాడు. ఆ సమయంలో కనకాక్ష రాజుగారితో, సేనాని కొడుకు మంగళవర్మ మాట్లాడుతున్నాడు. మంత్రిని చూడగానే రాజు, "మహామంత్రీ! మంగళవర్మ, యువరాజునూ, యువరాణినీ వెతకబో తానని, అనుమతి అడుగుతున్నాడు. నీ సలహా ఏమిటి?" అని అడిగాడు.

మంత్రి ఒకక్షణం ఆలోచించి, "మహా రాజా, ఈ పనికి మంచి సాహసంతోపాటు, ఏవో అలౌకిక శక్తుల సహాయం కూడా గల జయశీలు డనే యువకుడు దొరికాడు. అతడు ధరించిన కత్తికి అమోఘ శక్తు లున్నవట!" అన్నాడు.

కనకాక్ష రాజు ఆలోచనలోపడ్డాడు. మంగళవర్మకు మంత్రి మీద చాలా కోపం కలిగింది. అయినా అతడు దాన్ని



బయిటికి కనబరచకుండా, "అయ్యా, ఈ జయశీలు డనే అతడు గొప్ప కులీను డేనా? మహారాజుగారు, యువరాణినీ, యువరాజునూ వెతికి తెచ్చిన వారికి అర్ధ రాజ్యం యిస్తామని ప్రకటించారు. అందు కతడు అర్హుడేనా?" అని అడిగాడు.

ఈ అసందర్భపు ప్రశ్నకు మంత్రి చిరాకుపడుతూ, "యువరాణినీ, యువ రాజునూ అపహరించుకు పోయినవాళ్ళు మానవులో, దానవులో, దేవతలో కూడా తెలియదు. అలాంటి దశలో వారిని వెతికి తెచ్చినవాడు, ఎంత శక్తి మంతుడై వుంటాడు! అలాంటివాడు అర్ధ రాజ్యానికి ఎందుకర్హుడు కాడు?" అన్నాడు.

"అతడి కత్తికి అమోఘశక్తులున్న మాట నమ్మదగిందేనా? ఒకసారి యివ్వ మనండి. పరీక్షించి చూస్తాను," అన్నాడు మంగళవర్మ.

"ఇందుకు అతడేమీ అభ్యంతరం చెప్పడనుకుంటాను!" అన్నాడు మంత్రి.

కనకాక్ష రాజు ఎంతో సూక్ష్మబుద్ధీ, వివేకం కలవాడు. ఆయన తృటికాలంలో సంగతి సందర్భాలు అర్థంచేసుకుని, "మహామంత్రీ! ముక్కూ ముఖం తెలియని ఎవరో యువకుణ్ణి, పిల్లలను వెతికి తెచ్చేందుకు పంపటం ఎందుకు? ఆ జయశీలుడి దగ్గిరవున్న కత్తి ఏపాటి శక్తిగలదో పరీక్షించేందుకు, మంగళవర్మకు యిప్పించండి. శక్తిగలదైతే, ఆ యువకుడికి గొప్ప బహుమానం యిచ్చి, మన ఆస్థానంలోనే ఉద్యోగం యిద్దాం," అన్నాడు.

"ఎలాంటి పరీక్ష పెడదాం, మహారాజా?" అని అడిగాడు మంత్రి.

"మన మృగశాల అధికారితో చెప్పి, బోనుల్లోవున్న రెండు పెద్దపులులను తెప్పించండి. మంగళవర్మ, ఆ అమోఘ శక్తులు గల కత్తిని పట్టుకుని, బోనుల్లో నుంచి బయిటికి వచ్చిన పులుల్ని ఎదుర్కొంటాడు," అన్నాడు కనకాక్షరాజు.

మంత్రి సంగతి చెప్పగానే, జయశీలుడు సంతోషంగా తన కత్తిని, మంగళవర్మకు యిచ్చాడు. క్షణాల మీద పులులున్న బోనులు తెప్పించబడి, చుట్టూ పది అడుగుల ఎత్తున్న ప్రాకారం లోపల పెట్టించబడినై. మంగళవర్మ కత్తి తీసుకుని లోపలికిపోగానే ప్రాకారం తలుపులు మూసి వేశారు. రాజూ, మంత్రీ, జయశీలుడూ మొదలైన వాళ్ళు, ప్రాకారం దాపులనున్న భవనం పిట్ట గోడ పక్కన నిలబడి, లోపలికి చూడసాగారు.

మృగశాలాధికారి, మంగళవర్మను హెచ్చరించి, పైనుంచి బోనుల తలుపులు ఎత్తి, ప్రాకారం మీదికి వెళ్ళాడు. పులులు రెండూ భయంకరంగా అరిచి, మంగళవర్మ కేసి రాసాగినై.

—(ఇంకా వుంది.)






# తగిన వధువు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, నువు ఇలా శ్రమించటంలో నీ లక్ష్యం ఏదో నాకు తెలియదు గాని, లక్ష్యం చేరు కున్నంత మాత్రాన ఆశయం సిద్ధిస్తుం దనుకోవటానికి లేదు. అందుకు నిదర్శ నంగా నీకు చంద్రవర్మ కథ చెబుతాను, శ్రమ తెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

చంద్రవర్మ అనేవాడు క్షత్రియ యువ కుడు. అతను అన్నిటినీమించి అందాన్ని ఆరాధించేవాడు. అందమైన వస్తువులూ, ప్రకృతి దృశ్యాలూ, మనుషులూ కనిపించి నప్పుడు అతనికి కలిగేతృప్తి మరి దేనివల్లా కలిగేది కాదు.

## బేతాళ కథలు

అతనికి పెళ్ళీడు వచ్చిందని తల్లి దండ్రులు అతని వివాహానికి ప్రయత్నాలు తలపెట్టారు. కాని చంద్రవర్మ వారిని వారించి, "నా పెళ్ళి గురించి మీరు ఏమీ ప్రయత్నించ వద్దు. నాకు నచ్చిన కన్యను నేనే ఎంచుకుని పెళ్ళాడతాను," అని చెప్పేశాడు.

ఒకరోజు అతను అడవి కేసి వెళ్ళి, అక్కడి ప్రకృతి సౌందర్యాన్ని చూసి ఆనందిస్తూ కొంతసేపు తిరిగాడు. ఒక చోట అతనికి ఒక అందమైన కొలనూ, అందులో అందమైన కలువపూలూ, దాని ఒడ్డున మేస్తూ, పాలమీగడ రంగులో నిగ నిగలాడుతూ ఒక అమిత అందమైన గుర్రమూ కనిపించాయి.

వెంటనే చంద్రవర్మ ఆ గుర్రాన్ని సమీపించి, ఎగిరి దానిమీద ఎక్కి కూర్చున్నాడు. అతను ఎక్కిన మరుక్షణం ఆ గుర్రం పిచ్చిపట్టినట్టుగా శరవేగంతో పరిగెత్తుతూ అరణ్యంలోకి చాలాదూరం పోయింది.

చంద్రవర్మ, దాన్ని ఆపే మార్గంలేక, దాని మీద బోర్లా పడుకుని, కళ్ళు గట్టిగా మూసుకున్నాడు. గుర్రం అలా చాలా సేపు పరిగెత్తి, ఎక్కడో అతన్ని కింద పడేసి, ఎటో వెళ్ళిపోయింది. కిందపడిన చంద్రవర్మకు స్పృహతప్పింది.

అతనికి తిరిగి స్పృహ వచ్చేసరికి తెల్లవారుతున్నది. పరిసరాలు అతనికి కొత్తగా ఉన్నాయి. సమీపంలోనే ఒక



సెలయేరు పారుతున్నది. కొంచెం ఎగువ నుంచి తీయని పాట వినిపిస్తున్నది. ఆ పాడుతున్నది ఎవరో స్త్రీ.

పాట మాధుర్యానికీ, కంఠస్రావ్యానికీ, ముగ్ధుడై చంద్రవర్మ పాట వినిపించిన వైపుగా వెళ్ళి, ఆశ్చర్యంతో స్తంభించి పోయాడు. అతనికి ఒక ముచ్చటైన తోటా, దాని మధ్య ఒక అందమైన పర్ణశాలా, తోటలో పూలు కోస్తూ, పాడుతూ, తెల్ల బట్టలు ధరించి, జుట్టు విరబోసుకుని ఒక అందమైన సుందరీ కనిపించాయి.

ఆమె పాట ఆపగానే చంద్రవర్మ చప్పట్లు చరిచి, "అద్భుతం! అపూర్వం!" అన్నాడు.

ఆ అందగత్తె ఉలిక్కిపడి అతని కేసి చూసి, "ఏమిటి అద్భుతం? ఏమిటి అపూర్వం?" అని అతన్ని అడిగింది.

"నీ పాట అద్భుతం! నీ సౌందర్యం అపూర్వం!" అన్నాడు చంద్రవర్మ పరవశించిపోతూ.

ఆమె చిన్నగా నవ్వి, "నా అందాన్నే ఇంత మెచ్చుకుంటున్నావు. ఆ కనిపించే కొండ దిగువన, ఇదే సెలయేటి ఒడ్డున ఉండే అందగత్తెను చూస్తే ఇంకా ఏమంటావో! ఉండు, నీకు ఫలహారం ఏర్పాటు చేస్తాను," అని పర్ణశాలలోకి వెళ్ళిపోయింది.

చంద్రవర్మ ఆమె ఇచ్చే ఆతిథ్యం కోసం ఆగలేకపోయాడు. కొండ దిగువన





ఉండే సుందరిని చూడాలని అతని మనసు తహతహలాడుతున్నది. అందు చేత, అతను సెలయేరు వెంబడే నడుచు కుంటూ కొండ కేసి వెళ్ళిపోయాడు.

అతను కొండ దగ్గిరికి చేరుకునేసరికి సాయంకాలమయింది. అక్కడ సెల యేటి ఒడ్డున ఇంకా పెద్ద తోట ఉన్నది. ఆ తోట మధ్య ఒక అందమైన ఇల్లు ఉన్నది. ఆ ఇంట్లో ఒక అప్సరసలాటి ఆడది దీపాలు వెలిగిస్తున్నది.

చంద్రవర్మ ఆమెను సమీపించి, "ఈ ఇంట్లో నువు ఉండగా వేరే దీపాలు దేనికి? నీ అంత అందగత్తెను నేను ఇంతవరకు చూడలేదు." అన్నాడు.

ఆమె అతనికి అతిథి మర్యాదలు అన్నీ చేసి, భోజనం పెట్టి, పడుకోవటానికి హంసతూలికా తల్పం ఇచ్చింది. అతను తన అందాన్ని మరీ మరీ పొగడుతూ ఉండటం చూసి ఆమె, "కొండ మీద ఉండే అందగత్తెను చూసి ఉంటే నువు నా అందాన్ని ఇంతగా పొగడి ఉండవు! పొద్దు చాలాపోయింది, పడుకో!" అని తన గదికి వెళ్ళిపోయింది.

ఈ మాట విన్నాక చంద్రవర్మకు వస్తున్న నిద్ర కాస్తా పోయింది. ఆ కొండ మీది సుందరిని చూసేదాకా అతనికి ప్రాణాలు నిలిచేటట్టు లేవు. అతను నిశ్శబ్దంగా తలుపులు తెరుచుకుని బయటికి వచ్చి, ఆ చీకట్లోనే, ఆ కొండను ఎక్క నారంభించాడు.

చంద్రవర్మ కొండ పైకి చేరేసరికి సూర్యోదయం కావస్తున్నది. ఆ ప్రదేశం చాలా విశాలంగా ఉన్నది. అక్కడ అతను ఊహించనంత పెద్ద తోట ఉన్నది. దాని మధ్య గొప్ప భవనం ఉన్నది. అతను చూసిన సెలయేరుకు జన్మస్థానమైన కోనేరు ఆ తోటలోనే వున్నది. ఆ కోనేట్లో ఒక అత్యద్భుత సౌందర్యవతి స్నానంచేస్తూ చంద్రవర్మకు కనిపించింది.

అతను ఆమెను సమీపించి, పారవశ్యంతో, "నువే నా స్వప్న సుందరివి!

నీలాటి సౌందర్యవతి మూడు లోకాల లోనూ లేదు. నిన్నే పెళ్ళి చేసుకుంటాను!'' అన్నాడు.

''వెళ్ళు, వెళ్ళు! ఇక్కడ ఎక్కువ సేపు ఉన్నావంటే నీ మాన ప్రాణాలు దక్కవు!'' అంటూ ఆమె స్నానం ముగించి, భవంతిలోకి వెళ్ళింది.

చంద్రవర్మ హతాశుడై, కొండ దిగి, తాను లోగడ చూసిన ఇద్దరు సుందరుల కోసమూ చూశాడు. కాని వాళ్ళ జాడ అతనికి దొరకలేదు. అతను ఎలాగో తన స్వస్థలం చేరుకుని, తల్లిదండ్రులు ఎన్నిక చేసిన పిల్లను పెళ్ళాడాడు.

బేతాళుడు ఈ కథ చెప్పి, ''రాజా, ముగ్గురు లోకోత్తర సౌందర్యవతులను చూసినమీదట చంద్రవర్మలో సౌందర్య పిపాస విజృంభించటానికి బదులు ఎందుకు హరించుకుపోయింది? మొదటి ఇద్దరు సౌందర్యవతులూ చూపినపాటి ఆదరం కూడా మూడో ఆమె ఎందుకు చూపలేదు? ఈ అనుమానాలకు సమాధానం తెలిసి కూడా చెప్పకపోయావో నీ తల పగిలిపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, ''చంద్రవర్మలో ఉన్న లోపం సౌందర్య పిపాస కాదు; ఆ సౌందర్య పిపాసను తన వివాహంతో ముడిపెట్టటం. అతను సౌందర్యవతిని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉన్నా, సౌందర్యవతి అతన్ని పెళ్ళాడటానికి సిద్ధంగా ఉండకపోవచ్చు. మూడో సౌందర్యవతి విషయంలో అదే జరిగింది. అతను తన సౌందర్యాన్ని మెచ్చుకున్నందుకు ఆమె ఆగ్రహించలేదు; తనను పెళ్ళాడతానన్నందుకు ఆగ్రహించింది. మొదటి ఇద్దరి దగ్గిరా ఇది జరగలేదు. తన సౌందర్య పిపాస తనకు భార్యను తీసుకు రాదని గ్రహించగానే చంద్రవర్మ తన తల్లిదండ్రులు చూసిన పిల్లను చేసుకున్నాడు,'' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. —(కల్పితం)



# ధర్మ బుద్ధి

ఒక ఊళ్ళో ఒక శ్రీమంతుడు అపర దానకర్ణుడు. ఆయన వద్ద చిన్నయ్య అనే సేవకుడు ఉండేవాడు. వాడు చిన్నతనం నుంచీ శ్రీమంతుడి నౌకరు. ఒకనాడు శ్రీమంతుడు చిన్నయ్యతో కూడా ఒక సంతకు వెళితే, అక్కడ ఒక ఖరీదైన రథం కనబడింది. చందనం చెక్కలో జిలుగు పనితో మలిచిన ఆ రథానికి రెండు గుర్రాలున్నాయి. చిన్నయ్య ఆ బొమ్మ కేసి తన్మయుడై చూస్తూండటం చూసి, శ్రీమంతుడు దాన్ని కొని చిన్నయ్యకు బహుమానంగా ఇచ్చాడు.

ఒకనాడు శ్రీమంతుడి ఇంటికి ఒక అతిథి వచ్చి, చిన్నయ్య గదిలో ఉన్న చందన రథాన్ని చూసి ముగ్ధుడై, "ఎంత అందంగా ఉంది! ఇలాటిది ఎక్కడ దొరుకుతుంది?" అన్నాడు.

వెంటనే శ్రీమంతుడు, "దాన్నే తీసుకోండి," అని చిన్నయ్య చేత ఆ శిల్పాన్ని తన అతిథికి ఇప్పించాడు. చిన్నయ్య మనసు ఎంతో చిన్నబోయింది. అది గ్రహించి శ్రీమంతుడు, "నేను కూడా ఒకప్పుడు శరీర కష్టం చేసి బతికినవాణ్ణే. నిన్ను అందరికీ నా తమ్ముడుగా పరిచయం చేస్తున్నాను. నువ్వూ నా లాగే దానగుణం కలవాడివనుకున్నాను," అన్నాడు.

ఆ మాటతో చిన్నయ్య మనస్సు శాంతించింది. తరవాత కొద్ది రోజులకు ఆ అతిథి తన కూతురిని తెచ్చి, "ఈమెను మీ తమ్ముడికి ఇచ్చి పెళ్ళిచేయ నిశ్చయించాను," అన్నాడు.

చిన్నయ్యకు చందనపు బొమ్మతోబాటు చందనపు బొమ్మలాటి భార్య కూడా దక్కింది.

—శ్రీమతి అజీజా షరీఫ్.





# హీరాట్ నివాసి అమీర్

చాలాకాలం క్రితం హీరాట్‌లో ఒక అమీర్ ఉండేవాడు. అతనికి ఇద్దరు భార్యలు. ఇద్దరూ అందగత్తెలూ, వివేకవతులూనూ. అందు చేత అమీర్‌కు వారిద్దరి పైనా ప్రేమ ఉండేది. అయితే ఆయన పెడసరం మనిషి; ఒకరు చెప్పినట్టు వినేరకం కాదు.

వారి వంశంలో చాలాకాలంగా మాంసమూ, చేపలూ తినకపోవటం ఆచారంగా ఉండేది. వాళ్ళు గుడ్లు మాత్రమే తినేవారు. అమీర్ నదరైన దుస్తులూ, ఉంగరాలూ, ఇతర ఆభరణాలూ ధరించేవాడు. ఆయన భార్యలు కూడా అంతే. అతిథి మర్యాదలు చెయ్యటమూ, బంగారమూ, రత్నాలూ దానం చెయ్యటమూ, బిచ్చగాళ్ళకు లేదనక పోవటమూ, ఆయన ప్రధానగుణాలు. ఆయనకు వేట అంటె చాలా ప్రీతి. వేట ఆయనకు ఎప్పుడూ అచ్చివచ్చేవి. మిత్రులతో కలిసి అరణ్యానికి వేటకు వెళ్ళినప్పుడు, తతిమ్మా అందరికన్న పెద్ద జంతువులను ఆయనే కొట్టేవాడు.

కందహారుసుల్తాను చనిపోగా, ఆయన కొడుకు సింహాసనం ఎక్కాడు. సింహాసనం ఎక్కితేనేగాని కందహారు రాజకుమారులు వేటకు పోరు. సింహాసనం ఎక్కగానే కందహారు రాజకుమారుడు పెద్ద ఎత్తున వేట చెయ్యటానికి, తన వెంట హీరాట్ అమీరును తీసుకుపోవటానికి నిర్ణయించాడు. తనకు వేట అచ్చివస్తుంది గనక, తన గొప్ప రాజకుమారుడికి చూపుదామనుకున్నాడు అమీర్.

వేటకు పెద్ద ఎత్తున ఏర్పాట్లు జరిగాయి. అడవిలో గుడారాలు వేశారు. రేపు వేట అనగా అమీరు వచ్చి చేరాడు. కందహారుసుల్తాను ఆయనకు ఎదురు

ఏ. సి. సర్కార్, ఇంద్రజాలికుడు



వచ్చి స్వాగతం చెప్పాడు. ఆ రాత్రి విందులూ, వినోదాలతో సరదాగా గడిచింది. అమీర్ సుల్తానుకు వేటలో కిటుకులు అనేకం చెప్పాడు.

మర్నాడు ఉదయం బాకాలచప్పుళ్లతో వేట సంరంభం ఆరంభమయింది. అమీర్ తన విల్లూ, బాణాలూ తీసుకుని తన గుడారం నుంచి బయటికి అడుగు పెట్టగానే, చెట్టు మీది నుంచి ఒక అడవి కోడి ఆయన కాళ్ళముందు వాలి, ఒక గుడ్డు పెట్టి పక్కకు ఎగిరిపోయింది. అమీర్ కాలు ఆ గుడ్డుమీద పడి, ఆయన తొడుక్కున్న బంగారు నగిషీల పాదరక్షలు పాడయాయి.

"తోబా, తోబా! నా పాదరక్షలు పాడయాయి!" అన్నాడు అమీర్. ఆయన సేవకుడు వచ్చి, చప్పున ఆయన పాదరక్షలు మార్చాడు.

ఆ రోజు అమీర్‌కు వేటలో ఘోర పరాజయం జరిగింది. ఆయన తన బాణాలతో ఒక్క పిచ్చుకను కూడా కొట్టలేకపోయాడు. ఆవార సుల్తాను ఒక చిరత పులినీ, దుప్పినీ కొట్టాడు. అమీర్ పరాజయం రెట్టింపు అయింది. శిబిరానికి తిరిగి వచ్చేటప్పుడు అమీర్ వంచిన తల ఎత్తలేదు.

అమీర్ అవమాన భారంతో కుంగిపోతూ హీరాట్‌కు తిరిగి వచ్చాడు. ఇలా ఎందుకు జరిగిందో ఎంత ఆలోచించినా ఆయనకు అర్థంకాలేదు. ఇదంతా ఆ గుడ్డు ప్రభావమే నని ఆయనకు తోచింది. ఆయనకు గుడ్ల మీద అమితమైన కోపం వచ్చింది. ఆయన తన ఇంట్లో ఉన్న గుడ్ల నన్నిటినీ పగల గొట్టేసి, పెట్టలనూ, పుంజులనూ తన భవనం నుంచి తొలగించాడు. ఆనాటి నుంచి హీరాట్‌లో గుడ్ల మీద నిషేధం వచ్చేసింది.

రోజులూ, నెలలూ గడిచాయి. అమీర్ చిన్న భార్య ఒక మగబిడ్డను ప్రసవించింది. తరవాత ఆమె ఆరోగ్యం చెడింది. అది త్వరగా నయంకాక నీరసమూ, రక్త




హీనతా ఏర్పడ్డాయి. హకీం ఇచ్చిన మందులవల్ల ప్రయోజనం లేకపోయింది. ఆమెకు గుడ్లలో ఒక ఔషధాన్ని చేర్చి తినిపిస్తే కోలుకుంటుందని ఆయన అమీర్‌కు చెప్పాడు.

ఈ మాట వింటూనే అమీర్ కోపంగా, "హిరాట్‌లో గుడ్లమాట ఎత్తటానికి వీల్లేదు. ఆమె బతకకపోయినా సరే గాని, ఆ దిక్కుమాలిన గుడ్లను నగరంలోకి రానియ్యను," అన్నాడు.

చిన్న బీబీ పరిస్థితి రోజురోజుకూ క్షీణిస్తున్నది. హకీమ్‌గాని, మిత్రులుగాని, అమీర్ కుటుంబీకులుగాని ఏమీ చేయలేక పోయారు.

ఈ సమాచారం హిరాట్‌లోని ఇంద్రజాలికుడు హలీమ్‌కు తెలియవచ్చింది. అతను చిన్న బీబీకి అన్న. అతను ఈ సమస్య పరిష్కరించ నిశ్చయించి, చిన్న హిరాట్ పతాక తీసుకుని అమీర్ వద్దకు వచ్చి, "అమీర్ సాహెబ్, మీకు గుడ్లంటే పడదుట, హిరాట్ జెండా అంటే అయినా పడుతుందా?" అన్నాడు.

"తోబా, తోబా! అదేమిటి, హలీమ్? మన రాజ్య చిహ్నం పడకపోవటమేమిటి?" అన్నాడు అమీర్.

"అలాఅయితే, చూడండి, ఈ జెండాతో ఒక ఇంద్రజాలం చేస్తాను," అంటూ హలీమ్, ఏదో మంత్రాలు చదువుతూ జెండాను తన చేతులలోకి పోగుచేసుకున్నాడు.

"లైలా....ఇస్మత్ ఆరా....హా....హా," అన్నాడు హలీమ్.

అందరూ నిర్ఘాంతపోయి చూస్తూండగా జెండా కాస్తా గుడ్డుగా మారింది. "దీన్ని మీరు ద్వేషించలేరు అమీర్ సాహెబ్!" అంటూ హలీమ్ గుడ్డును జేబులో పెట్టుకున్నాడు.

"ప్రభూ, ఆ గుడ్డును—అదే, గుడ్డు రూపంలో ఉన్న జెండాను—తీసుకుని, బీబీకి చికిత్స చేతునా?" అని హకీమ్ అడిగాడు.

అమీర్ సరే నన్నట్టు తల ఊపాడు. హలీమ్ తన జేబులో నుంచి గుడ్డు తీసి హకీమ్ కిచ్చాడు. అతను హకీమ్‌తో, ''నా దగ్గిర చాలా జెండాలున్నాయి. మీకు గుడ్డు కావలిసి నప్పుడల్లా నన్ను అడగండి,'' అన్నాడు.

గుడ్డుతో తయారు చేసిన ఔషధం చక్కగా పనిచేసింది. చిన్న బీబీ వేగంగా కోలుకుని, పక్షం రోజులలో మామూలు మనిషి అయింది. వైద్యం చేసినందుకు అమీర్ హకీమ్‌కు బోలెడన్ని అష్రఫీలు బహూకరించాడు.

హకీమ్ వాటి నన్నిటినీ తీసుకుపోయి హలీమ్‌కు చూపి, ''ఇది పూర్తిగా మీకు చెందవలసిన బహుమానం. మీరు ఇచ్చిన గుడ్లతోనే బీబీ కోలుకున్నది,'' అన్నాడు.

''అంతా నేను తీసుకోను. కావాలంటే సగం తీసుకుంటాను, హకీమ్ సాహెబ్!'' అన్నాడు హలీమ్.

హకీమ్ అష్రఫీలు ఎంచుతూ, ''హలీమ్, జెండా గుడ్డు ఎలా అయిందో కాస్త చెబుతావా? నేను ఎవరికీ చెప్పను, అల్లా మీద ఒట్టు!'' అన్నాడు.

''చాలా తేలిక, మిత్రమా. కందహారు నుంచి కొన్ని గుడ్లు తెచ్చాను. ఒక దానికి చిల్లిపెట్టి లోపలిభాగం శుద్ధిచేశాను. తరవాత డొల్ల ఎండబెట్టి, ఒక చిన్న సిల్కు జెండా కొనకు బంకరాచి గుడ్డు డొల్ల లోపల అంటించాను. నేను ఇంద్రజాలం చేసేటప్పుడు గుడ్డు నా ఎడమ చేతిలోనే కనిపించకుండా ఉన్నది. జెండాను నా చేతుల్లోకి తీసుకునేటప్పుడు నా ఎడమ చేతి చూపుడు వేలుతోనూ, బొటనవేలితోనూ దాన్ని లోపలికితోశాను. నేను గుడ్డు చూపినప్పుడు జెండా దానిలో ఉన్నది. నేను రెండోసారి తీసి ఇచ్చినది నిజమైన గుడ్డు. అది ముందుగానే నాదగ్గిర ఉన్నది. తరవాత ఇచ్చిన గుడ్లన్నీ కందహారు నుంచి తెచ్చినవే!'' అన్నాడు హలీమ్.

''నీ ఇంద్రజాలం దొడ్డది. దానికి తిరుగులేదు,'' అన్నాడు హకీమ్ ఉత్సాహంతో హలీమ్ చెయ్యిపట్టుకుని.





# తెలివైన కోడలు

ఒక ఊళ్ళో వృద్ధ దంపతులు ఉండే వారు. వారికి ముగ్గురు కొడుకులు. ముగ్గురికీ పెళ్ళిళ్ళు అయి, భార్యలు కాపరానికి వచ్చారు. అందరూ ఉమ్మడి గానే కాపరం చేస్తున్నారు. అయితే తోడికోడళ్ళ మధ్య రానురాను కీచులా టలు ఎక్కువయాయి. ఇది గమనించి వృద్ధ దంపతులు, ఉన్న ఆస్తిని ముగ్గురు కొడుకులకూ పంచి, ఇంటిని కూడా మూడు వాటాలు చేసి ముగ్గురికీ ఇచ్చి, ఆ ఇంటి ఆవరణలోనే ఒక పూరి ఇల్లు వేసుకుని, అందులో ఉంటూ, వంతుల ప్రకారం కోడళ్ళు పంపే భోజనం తింటూ ప్రశాంతంగా జీవిస్తున్నారు.

మూడు కాపరాలు అయాక తోడికోడళ్ళ మధ్య కీచులాటలు తగ్గాయి, కాని ఒకరిని ఒకరు వెయ్యి కళ్ళతో కనిపెట్టి ఉండ టమూ, ఒకరితో ఒకరు పోటీ పడటమూ హెచ్చాయి. ఏ వాటాలో ఏం జరిగినా మిగిలిన వాటాల వాళ్ళకు వెంటనే తెలిసి పోయేది. ఏ తోడికోడలికి మొగుడు ఏం చేయించిపెట్టినా, మిగిలిన ఇద్దరూ తమ మొగుళ్ళ ప్రాణాలు తీసి అవే చేయించు కునేవాళ్ళు. ఏ పండగో, పబ్బమో వచ్చి నప్పుడు ఒకరిమీద ఒకరు పోటీపడి పిండి వంటలు చేసి, ఒకరి కొకరు గొప్పగా ఇచ్చుకుంటూండేవారు.

కొంత కాలానికి పెద్ద కోడలికీ, మూడో కోడలికీ మధ్య ఏదో దెబ్బలాట వచ్చి, మాటలు లేకుండా పోయాయి. అది మొదలు ఆ ఇద్దరూ రెండో ఆవిడ వద్ద ఒకరిమీద ఒకరు చాడీలు చెప్పుకుంటూ రాసాగారు.

వృద్ధురాలి మెడలో పదిహేను కాసుల పాతకాలపు బంగారు గొలుసు ఒకటి ఉండేది. అది మూడు తరాల నుంచీ

గువ్వల నిర్మలాదేవి

ఆ ఇంటి కోడళ్ళకు సంక్రమిస్తూ వస్తున్నది. ఒకనాడు ముసలాయన తన భార్యతో, ''మనం ఉన్న ఆస్తి కొడుకులకు పంచేసి చేతులు కడిగేసుకున్నాం గదా, ఇంకా నీకా గొలుసు ఎందుకు? కోడళ్ళలో ఎవరికైనా-ఇచ్చెయ్యగూడదా?" అని అడిగాడు.

''అదే నేనూ చూస్తున్నాను. ఇది చెడగొట్టి ముగ్గురికీ పంచి ఇచ్చే వస్తువు కాదు. దీన్ని మరొకతరం పాటు జాగ్రత్తగా దాచేవాళ్ళు ఆ ముగ్గురిలో ఎవరా అని ఆలోచిస్తున్నాను," అన్నది వృద్ధురాలు.

ఎలాగో ఈ మాటలు పెద్ద కోడలి చెవిన పడ్డాయి. ఆమె ఆ రాత్రి ఆ విషయం కాస్తా తన భర్త చెవిన వేసింది. పక్కవాటాలలో చీమ చిటుక్కుమంటే వినగల రెండోకోడలు సంగతి గ్రహించి, తన భర్తతో చెప్పింది.

''ఇంకేం? నీ తెలివితేటలు ఉపయోగించి ఆ గొలుసు నువే సంపాదించుకో,'' అన్నాడు ఆమె భర్త నవ్వుతూ.

నిజానికి రెండో కోడలు మిగిలిన ఇద్దరి కన్నా తెలివైనది. ఆమె తన అత్తగారి మెప్పు ఎలా సంపాదించాలా అన్న ఆలోచనలో పడింది.

రెండో కోడలూ, ఆమె భర్తా అనుకున్న మాటలు మూడో కోడలు చెవిన కూడా పడ్డాయి. అంతకాలమూ అత్తగారి గొలుసు తమకు సమంగా పంపకం అవుతుందను



కున్న కోడళ్ళు ఇప్పుడు ఎవరిమటుకు వారే దాన్ని సంపాదించాలన్న ప్రయత్నంలో పడ్డారు. వాళ్ళు తమ అత్తగారి మీద ఎన్నడూలేని ప్రేమాభిమానాలు కనబరచసాగారు.

ఇలా ఉండగా ఉగాది పండగ వచ్చింది. ఈ సమయంలో అత్తగారిని మెప్పించటానికి ఒకరినొకరు మించాలనుకున్నారు. మొదటి కోడలు తాను చేయదలుచుకున్న పిండివంటలను గురించి భర్తకు చెప్పింది. మూడో ఆవిడ తాను చేయాలనుకున్న పిండివంటలకు ఏమేమి సరుకులు తీసుకురావాలో తన భర్తకు చెప్పింది. ఈ వివరాలన్నీ రెండో కోడలు విన్నది.

ఇంతలో రెండో కొడుకు ఆమె వద్దకు వచ్చి, "పండగకు ప్రత్యేకంగా ఏం పిండి వంటలు చెయ్యబోతున్నావు ?" అని అడిగాడు.

"నేను ఏ వంటకమూ చెయ్యబోవటం లేదు. మీరు మాత్రం మామగారికి ఒక పంచెలచాపూ, అత్తగారికి ఒక చీరా, రవికా తీసుకురండి," అన్నదామె.

ఎలాగూ తన తోడికోడళ్ళు ఇద్దరూ తనకు తాముచేసిన వంటకాలు ఇస్తారు. అలాటప్పుడు తాను వేరేవండటం దండుగ అనుకున్నది ఆమె. అనుకున్నట్టే, పెద్ద కోడలు తాను తయారు చేసిన పిండి వంటలు ఒక పళ్ళెం నిండా పెట్టి, పిట్ట గోడమీదిగా రెండో కోడలికి అందించింది.



అలాగే మూడో కోడలు చేసినవి కూడా ఆమెకు అందాయి. పెద్దావిడకూ, మూడో ఆవిడకూ మధ్య మాటలులేనట్టే, ఇచ్చి పుచ్చుకోవటాలు లేవు. అందుచేత రెండో కోడలు ఒకరు ఇచ్చిన దానిలోనుంచి కొంచెం కొంచెం తీసి రెండో వారికి ఇచ్చి, అవి తాను చేసిన పిండి వంటలన్న అభిప్రాయం కలిగించింది. మిగిలిన పిండి వంటలలో కొద్దిగా భర్తకు ఇచ్చి, మిగిలినవి ఒక పళ్ళెంలో పెట్టి, భర్త తెచ్చిన బట్టలతో సిద్ధంగా ఉన్నది.

పెద్ద కోడలూ, ఆఖరు కోడలూ వెళ్ళి గుడిసెలో ఉన్న అత్తమామలకు తమ తమ పిండి వంటలు అందజేసి వచ్చేసినాక, ఆమె అత్తమామల వద్దకు వెళ్ళి, తాను తెచ్చిన ఫలహారాల పళ్ళెం వాళ్ళ ముందు పెట్టి, కొత్త బట్టలు అత్తమామల చేతిలో పెట్టి, వాళ్ళ కాళ్ళకు మొక్కుకున్నది. అత్తగారు తన రెండో కోడలు తెచ్చిన పళ్ళెం కేసి చూసి, తన కాళ్ళకు నమస్కరించిన కోడలిని లేవనెత్తి, తన మెడలోని గొలుసు తీసి ఆమె మెడలో వేసింది. రెండో కోడలు వెళ్ళిపోయాక ముసలాయన, "ఈమె కొత్తబట్టలు పెట్టిందనా గొలుసు ఇచ్చావు?" అని భార్యను అడిగాడు.

"కాదు, దీనికి తెలివీ, పొదుపూ ఉన్నాయి. దీని దగ్గిర గొలుసు మరోతరం దాకా సురక్షితంగా ఉంటుంది," అంటూ ముసలావిడ, తన రెండో కోడలు తెచ్చిన పిండి వంటల రహస్యం చెప్పింది.

మిగిలిన ఇద్దరు కోడళ్ళూ రెండో కోడలు మెడలో గొలుసు చూసి గతుక్కుమన్నారు. పిండి వంటల విషయంలో ఆమె చేసిన మోసమూ, తమకు తెలియకుండా ఆమె అత్తమామలకు బట్టలు పెట్టటమూ వాళ్ళకు తెలిసిపోయింది. అది మొదలు వాళ్ళిద్దరూ ఏకమైపోయి, రెండో కోడలుతో మాట్లాడటం మానేశారు. ఒకరి మీద ఒకరు చెప్పే చాడీలు వినే బాధ తప్పినందుకు రెండో కోడలు కూడా సంతోషించింది.



# 171. చచ్చి బతికిన దేవాలయం

క్రీస్తుకు పూర్వం మూడవ సహస్రాబ్దంలో అర్మేనియాలోని గార్ని వద్ద ఒక జనవాసం ఏర్పడింది. అక్కడ ఒక కోట కూడా వెలిసింది. క్రీస్తుపూర్వం రెండో శతాబ్దిలో అర్మేనియా రాజులు గార్ని వద్ద తమ వేసవి జీవితం వెళ్ళబుచ్చేవారు. క్రీ. శ. 59 లో రోమనులు గార్నిని ధ్వంసం చేశారు. అది పునర్నిర్మించబడి తిరిగి 7 వ శతాబ్దిలో మళ్ళీ ధ్వంసం చేయబడింది. మూడు శతాబ్దాల అనంతరం తిరిగి నిర్మించినా, 17 వ శతాబ్దిలో ఆఖరుసారి ధ్వంసం చేయబడింది. అప్పుడు విధ్వంసమైన దేవాలయం తాలూకు రాళ్ళన్నీ ఉన్నాయి. వాటిని ఏర్చి, పేర్చి, కూర్చి ఆధునికులు ఆ దేవాలయాన్ని పునర్నిర్మించారు. ఇది ఇప్పుడు యెరివాన్‌కు 27 కిలో మీటర్ల దూరాన ఉన్నది.





# కలహాకల్యాణం

ఒక ఊళ్ళో ఒక పెళ్ళిళ్ళ పేరయ్య ఉండేవాడు. అతను ఆ ఊరూ, ఈ ఊరూ తిరిగి సంబంధాలు కుదుర్చుతూ ఉండేవాడు. అతను సంబంధాలు కలపటంలోనే గాక, చెడగొట్టటంలో కూడా ఘటికుడు.

ఒకనాడు పేరయ్య ఉదయంవేళ స్నానానికి రేవుకు పోతూండగా పరంధామయ్య అనే ఆయన తన ఇంట్లోకి పిలిచి తన కూతురికి మంచి సంబంధం ఉంటే చూసిపెట్టమన్నాడు.

'' సంబంధానికి ఎక్కడికో పోనవసరం లేదు. వెనక వీధిలోకి కొత్తగా వచ్చిన మాధవయ్య కొడుకు ఉన్నాడు. అతను మీ పిల్లకు సరిఅయిన జోడు,'' అన్నాడు పేరయ్య.

'' ఇకనేం ? నువ్వు వెళ్ళి ఆ సంబంధం మాట్లాడి, పెళ్ళి లాంఛనాల సంగతి ఏమిటో కూడా తేల్చుకురా ! '' అన్నాడు పరంధామయ్య, పేరయ్య చేతిలో తాంబూలం పెట్టుతూ.

పేరయ్య మాధవయ్య ఇంటికి వెళ్ళి, పెళ్ళిమాటలు మాట్లాడాడు. మాధవయ్య పరంధామయ్య సంబంధానికి ఒప్పుకుని, పరంధామయ్య ఇంటికి వచ్చి, నిశ్చితార్థం చేసుకున్నాడు. కొంతకాలంపాటు మంచి ముహూర్తాలు లేకపోవడంవల్ల, పెళ్ళి వెంటనే జరిగే అవకాశం కలగలేదు.

అకస్మాత్తుగా ఒక రోజు మాధవయ్య పేరయ్యను పిలిపించి, '' పేరయ్యా, పెద్ద చిక్కు వచ్చిపడింది. పొరుగూళ్ళో మాకు కావలసిన బంధువులున్నారు. వాళ్ళు ఇంతకుముందే వచ్చి వెళ్ళారు. బాగా ఉన్నవాళ్ళు. ఒక్కతే కూతురు. మొత్తం ఆస్తి అంతా ఆ పిల్లకే చెందుతుంది. మనమేమో తొందరపడి పరంధా

వీరేపల్లి జయరాంరెడ్డి

మయ్యకు మాట ఇస్తిమి. ఇప్పుడెలాగా?'' అన్నాడు.

పేరయ్యకు మాధవయ్య అభిప్రాయం తెలిసింది. "ఈ మాత్రానికే కంగారుపడటం దేనికి? మీరు ఒక పని చెయ్యండి. పెళ్ళి రద్దు చేసుకుంటున్నట్టు పరంధామయ్యకు కబురు చెయ్యండి." అన్నాడు పేరయ్య.

''నిశ్చితార్థం కూడా అయిపోయింది గద! ఏ కారణమూ చెప్పకుండా పెళ్ళి రద్దుచేసుకున్నామంటే అందరూ మనని మొహాన అడగరూ?'' అన్నాడు మాధవయ్య.

''దానికేముందీ? ఈ సంబంధం చెడగొట్టే భారం నాది! మీరు మీ వాళ్ళ సంబంధాన్ని ఖాయం చేసుకోండి.'' అన్నాడు పేరయ్య.

కుదిరిన పెళ్ళిని చెడగొట్టడానికి మాధవయ్య పేరయ్యకు కొంత డబ్బు కూడా ఇచ్చి పంపాడు.

పేరయ్య అన్నంత పని చేశాడు. పరంధామయ్య కూతురికి లేని లోపాన్ని కల్పించి మొత్తంమీద మాధవయ్య కొడుకు సంబంధం చెడగొట్టేశాడు. ఇదంతా ముగిశాక మాధవయ్య పేరయ్యకు మరికొంత డబ్బు ముట్టజెప్పాడు.

తరవాత కొంత కాలానికి పేరయ్య కొడుకుకే ఒక పెళ్ళిసంబంధం వచ్చింది. ఆడపిల్ల తరఫువాళ్ళు మాట్లాడడానికి



పేరయ్య ఇంటికి వచ్చారు. వాళ్ళ వెంట ఒక జ్యోతిష్కుడు కూడా ఉన్నాడు. వచ్చినవాళ్ళు మంచి స్థితిపరులు కావడం చేత, పేరయ్య వాళ్ళకు ఘనంగా మర్యాదలు చేసి, తన కొడుకు జాతకచక్రం తెచ్చి జ్యోతిష్కుడి ముందు పెట్టాడు.

జ్యోతిష్కుడు దాన్ని పరీక్షించి, ఏదో గుణించి, ''లాభం లేదండి! ఈ పిల్లవాడు అర్ధాయువు! పిల్ల జాతకమూ, పిల్లవాడి జాతకమూ కలవటంలేదు,'' అన్నాడు.

వచ్చిన వాళ్ళకు జాతకాల పట్టింపు చాలా ఉండడంచేత, వాళ్ళు వెంటనే లేచి వెళ్ళిపోయారు. వాళ్ళ వెనకనే జారుకుంటున్న జ్యోతిష్కుణ్ణి పేరయ్య జబ్బపట్టుకుని లోపలికిలాగి,''నా కొడుకు అర్ధాయువు అని అబద్ధం చెప్పి, నిక్షేపం లాంటి సంబంధం ఎందుకు చెడగొట్టావు?'' అంటూ కొట్టబోయాడు.

జ్యోతిష్కుడు గిలగిల లాడుతూ, ''అయ్యా, మీ కొడుకు చెయ్యమంటేనే ఈ పని చేశాను. డబ్బుకు గడ్డి తినేవాణ్ణి. నన్ను వదిలెయ్యండి,'' అన్నాడు.

పేరయ్యకు ఎవరో తన చెంప మీద ఛెళ్ళున చరిచినట్టయింది. ఇన్నాళ్ళూ తాను చేసినదీ అ పనే!

ఇంతలో పేరయ్య కొడుకు, పరంధామయ్య కూతుర్ని వెంట బెట్టుకుని లోపలికి వచ్చాడు. ఇద్దరూ పేరయ్య కాళ్ళకు మొక్కారు.

''నాన్నా! ఈ అమ్మాయికి కుదిరిన పెళ్ళిని నువు చెడగొట్టావని నాకు తెలుసు. అ తరవాత ఈమెకు పెళ్ళి ఎలా అవుతుందని పరంధామయ్య విచారిస్తూ ఉండడం కూడా నాకు తెలిసింది. నువు చేసిన చెడుకు తగ్గ విరుగుడు, ఈమెను పెళ్ళి చేసుకోవడమే అనుకున్నాను. అలాగే ఈమెను పెళ్ళి చేసుకున్నాను. మమ్మల్ని దీవించు!'' అన్నాడు పేరయ్య కొడుకు.

పేరయ్య కొయ్యబారిపోయి, చూస్తూ నిలబడ్డాడు.






సువర్ణుడు అనేవాడు విజయనగరానికి కొంత దూరంలో ఉండిన ఒక గ్రామంలో నివసిస్తూ ఉండే వాడు. వాడు మంచి తెలివితేటలు గలవాడు.

ఒక రోజు వాడున్న గ్రామంలో చాటింపు వేశారు. విజయనగరంలో ఉండే ఒక సంపన్నుడికి చాలామంది పశువుల కాపర్లు కావాలట. అనుభవం ఉన్నవాళ్ళు విజయనగరం వచ్చి, ఫలానా రోజున ఆ సంపన్నుణ్ణి చూడాలని చాటింపు వేశారు.

సువర్ణుడికి పశువులను కాయటంలో కొంత అనుభవం ఉన్నది. అదీకాక వాడికి చాలాకాలంగా విజయనగరం చూడాలన్న కోరిక కూడా ఉన్నది. రెండూ కలిసి వస్తాయిగదా అని, వాడు దారి ఖర్చులకు డబ్బు తీసుకుని బయలుదేరి, విజయనగరం చేరాడు.

ఆ సంపన్నుడి పశుసంపద చూసి సువర్ణుడు అబ్బురపడ్డాడు. ఆయన వద్ద అయిదువందల ఆవులూ, వెయ్యి గేదెలూ ఉన్నాయి. ఆయన అనేక గ్రామాలలో వేయించిన చాటింపు విని, దాదాపు నూరుమంది పశువుల కాపరిపని చెయ్యటానికి వచ్చారు.

సంపన్నుడు వచ్చిన వారి అందరి అనుభవమూ గురించి విచారించి, యాభై మందిని మాత్రం కొలువులో ఉంచుకుని, మిగిలిన వాళ్ళకందరికీ దారి ఖర్చుల కింద తలా యాభైవరహాలూ సంచీలలో పోసి ఇచ్చి పంపేశాడు.

సువర్ణుడికి ఉద్యోగం దొరకలేదు గాని యాభై వరహాలు ముట్టాయి. వాడు సాయంకాలం దాకా విజయనగరం తిరిగి చూసి ఆనందించి, చీకటి పడినాక ఒక పూటకూళ్ళ ఇంటికి చేరుకుని, అక్కడే

మల్లాది వెంకటకృష్ణమూర్తి

రాత్రి భోజనం చేసి, మర్నాడు ఉదయం లేచి తన గ్రామానికి తిరిగి పోదామని నిశ్చయించుకుని, ఆ రాత్రికి ఆరుబయట పడుకున్నాడు.

సువర్ణుడి లాగే పశువుల కాపరి ఉద్యోగం కోసం ఏదో గ్రామం నుంచి వచ్చిన మరొక మనిషి కూడా ఆ పూట కూళ్ళ ఇంటికే వచ్చాడు. అతనికి కూడా ఉద్యోగం దొరకలేదు గాని, దారి ఖర్చులు ముట్టాయి. అయితే అతని సంచీలో యాభై వరహాలు ఉండటానికి బదులు నూరు వరహాలున్నాయట. ఎవరో పొర పాటున ఆ సంచీని రెండు సార్లు నింపి ఉంటారు. ఆ మనిషి పరమానందంతో ఈ సంగతి, పూటకూళ్ళింట తటస్థపడిన ఎవరితోనో చెప్పుతూ ఉండటం సువర్ణుడి చెవిన పడింది

తెల్లవారగానే నూరు వరహాలు సంపాదించుకున్న వాడు తన గ్రామానికి బయలుదేరి వెళ్ళిపోయాడు. కాని సువర్ణుడు ముందు అనుకున్న ప్రకారం తన గ్రామానికి తిరిగి పోక, తిన్నగా ధనికుడి ఇంటికి వెళ్ళి, తన సంచీలోని యాభై వరహాలూ ధనికుడి ముందు పెట్టి, ధనికుడితో, ''అయ్యా, నాకు దారి ఖర్చుల కింద తమరు ఇచ్చిన సంచీలో యాభై వరహాలున్నాయని చెప్పారు. కాని లెక్క పెట్టి చూస్తే నూరు ఉన్నాయి. ఏదో పొరపాటు జరిగినట్టున్నది,'' అన్నాడు.

అందరికీ దారి ఖర్చులిచ్చి పంపేసిన అనంతరం సంపన్నుడు తన డబ్బు లెక్క చూసుకుంటే యాభై వరహాలు లెక్కతేల లేదు. అయితే అవి తన దగ్గరికి నడిచి వస్తాయని అయన కలలో కూడా అనుకోలేదు.

సువర్ణుడి "నీతి'' చూసి అయన ముచ్చటపడి, వాడికి తన వద్ద పశువుల కాపరి కన్న పెద్ద జీతంతో మంచి ఉద్యోగం ఇచ్చి దగ్గిర ఉంచుకున్నాడు.

సువర్ణుడి తెలివితేటలు వాడికి అలా ఉపయోగపడ్డాయి.





పూర్వం గిరివ్రజపురాన్ని మణిపాలుడనే రాజు పాలించేవాడు. అతడు గొప్ప దైవభక్తీ, యుక్తీ, ఔదార్యమూ కలవాడు. ఆ రాజవంశంలో ఒక ఆచారం ఉండేది. రాజు ప్రతిరోజూ తమ కులదేవత అయిన ప్రభామణీదేవికి ఒక మణి అలంకరించి పూజ చేసి, అలా పూజచేసిన మణులను ఒక బంగారు పెట్టెలో పెట్టి, ఏడాది పూర్తి అయి, దేవికి ఉత్సవం జరిగిన రోజున, యోగ్యులైన పేద బ్రాహ్మణులకు దానం చేసేవాడు. తరతరాలుగా వస్తున్న ఈ ఆచారాన్ని ఉల్లంఘిస్తే కీడు మూడుతుందని రాజు నమ్మకం.

రోజూ పూజ ముగిసిన అనంతరం రాజు మణిని తీసి, భద్రశీలి అనే తన కోశాధికారికి ఇచ్చేవాడు. భద్రశీలి అందరి సమక్షంలోనూ ఆ మణిని బంగారు పెట్టెలో పెట్టేవాడు.

ఆ పెట్టెకు తాళపు చెవులు ఉండేవి; ఒకటి రాజు వద్దా, రెండవది భద్రశీలి వద్దా ఉండేది.

భద్రశీలి ఇరవైఐదేళ్ళుగా రాజును సేవిస్తూ, విశ్వాసపాత్రుడని పేరు తెచ్చుకున్నవాడు.

ఒక రోజు మణిపాలుడు కొలువు తీరి ఉండగా, భద్రశీలి విచారవదనంతో రాజుకు ఇలా విన్నవించుకున్నాడు:

"రాజా, మహాపచారం జరిగిపోయింది. ఈ దూర్వార్త తమతో ఎలా మనవి చేయాలో నాకు తెలియటం లేదు. మీరు అభయం ఇస్తే చెబుతాను; బంగారు పెట్టెలో ఇరవై మణులు తగ్గి కనబడుతున్నాయి. ఈ ఘోరమైన దొంగతనం ఎలా జరిగినదీ అంతు బట్టకుండా ఉన్నది. ఆ పెట్టె తాళపు చెవులు మీ వద్దా, నావద్దా మాత్రమే ఉన్నాయి. దాన్ని రోజూ తెరి

చేదీ, మూసేదీ నేను మాత్రమే. అలాటప్పుడు మరెవరిని శంకించినా అపచారమే అవుతుంది. దొంగతనం ఎలా జరిగినా మణులు పోవటానికి నేనే బాధ్యుణ్ణి అవుతాను. అపనింద నాకే వస్తుంది. ఒకసారి జరిగిన దొంగతనం మరొకసారి జరగవచ్చు. అందుచేత ఈ తాళం చెవి తమరే తీసుకోండి.''

మణులు దొంగిలించ బడినందుకు రాజు అమిత ఆశ్చర్యపోయాడు. దొంగ భద్రశీలి కావాలి, లేక తాను కావాలి. తాను దొంగతనం చేయకపోయినా, తన అశ్రద్ధవల్ల తన వద్ద ఉండే తాళపుచెవి ఎవరికైనా చిక్కి, వాళ్లు దాని సహాయంతో మారు తాళపుచెవి చేయించి ఉండవచ్చు.

అందుచేత భద్రశీలి వద్దనుంచి రాజు తాళపు చెవి తీసుకోలేదు. అందుకు రాజు ఆలోచించిన కారణాలు ఇంకా కొన్ని ఉన్నాయి.

ఒకవేళ భద్రశీలే దొంగ అయితే, అతనినుంచి తాళం చెవి తీసుకున్న తరవాత అతనే దొంగ అని రుజువుచేసే అవకాశం రాజుకు ఉండదు. అంతేగాక భద్రశీలి వద్దనుంచి తాళపుచెవి తీసుకోవటం, పదిమందిలోనూ రాజు అతన్ని శంకించినట్టే అవుతుంది. రాజే దొంగతనం చేశాడని సభలో కొందరికైనా అనుమానం ఉండవచ్చు.

ఇదంతా ఆలోచించి మణిపాలుడు భద్రశీలితో, ''భద్రశీలీ, అధైర్యపడకు.



మణులు పోయినందుకు నువు ఎంత బాధ్యుడివో, నేనూ అంత బాధ్యుణ్ణే! మరొకసారి దొంగతనం జరిగినా నిన్ను నేను నిందించనని ఈ నిండు సభలో మాట ఇస్తున్నాను. మళ్ళీ దొంగతనం జరిగితే అప్పుడు నీ తాళం చెవి తీసుకుంటాను. ఈలోపల దొంగనుపట్టే ప్రయత్నంలో ఇద్దరమూ ఉందాం. ఆ ప్రయత్నంలో ఏ వేళప్పుడు పూజామందిరంలో ప్రవేశించటానికైనా నీకు పూర్తి స్వేచ్ఛ ఇస్తున్నాను,'' అన్నాడు.

రాజు ఉదారబుద్ధిని సభలో అందరూ మెచ్చుకున్నారు.

ఆటు తరవాత బంగారు పెట్టె నుంచి మణులు ఏవీ మాయం కాలేదు. కొద్ది రోజుల అనంతరం దేవిఉత్సవం వచ్చింది. ఉత్సవం నాటికి పూజా మందిరంలో అత్తరు పన్నీరుల సువాసనలూ, పూల మరిమళాలూ, ధూపపు వాసనలూ నిండి పోయాయి.

దేవీపూజ ముగియగానే మణులను దానంచెయ్యవలసి ఉన్నది. ఇవాళ రాజు బంగారు పెట్టెను తెప్పించి, దానిని తెరిచే పని భద్రశీలికి అప్పగించక, పురోహితుల చేత పెట్టెను తెప్పించి, దానిని తన తాళపు చెవితోనే తెరిచి, మణులను లెక్కపెట్టాడు. అదివరకు పోయిన ఇరవై మణులు కాక మరి పది మణులు, అవి కూడా ఒక్క రాత్రిలో, పోయాయి! తాళపుచెవి చేతబట్టుకుని సిద్ధంగా ఉన్న



భద్రశీలి ఈ మాట వింటూనే కుప్పకూలి పోయి, భోరున ఏడవసాగాడు.

మణిపాలుడు అతనితో, "భద్రశీలీ, ఎందుకు విచారిస్తావు? దొంగ పట్టుబడే వరకూ నేను నీ మీద ఎలాటి ఆరోపణా చెయ్యనని ముందే చెప్పాను గద. రెండో సారి కూడా దొంగతనం జరిగింది గనక నీ తాళపుచెవి తీసుకుంటాను. దాన్ని ఇలా ఇయ్యి!" అన్నాడు.

భద్రశీలి ఇచ్చిన తాళపుచెవిని తీసుకుంటూ తలవంచిన రాజు చప్పున తల ఎత్తి, "భద్రశీలీ, ఆ తాళంచెవితో బాటు ముప్పై మణులను కూడా ఇచ్చెయ్యి!" అన్నాడు.

రాజు యిలా ఆజ్ఞాపించగానే, భద్రశీలి కొయ్యబారిపోయాడు. అందరూ నిర్ఘాంత పోయారు.

మణిపాలుడు తన మంత్రిని పిలిచి, అక్కడ ఉన్న అందరి చేతులూ వాసన చూసి, తన చేతులూ, భద్రశీలి చేతులూ వాసన చూడమన్నాడు.

మంత్రి అలాగే చేసి, "తమరి చేతులూ, భద్రశీలి చేతులూ ఒక వింత సువాసన కలిగి ఉన్నాయి," అన్నాడు.

"అవును. అది కాశ్మీరరాజు నా కోసం ప్రత్యేకంగా పంపే అత్తరు. నేను రోజూ మణులను లెక్కస్తూనే ఉన్నాను. నిన్నటి దాకా మరొక దొంగతనం జరగలేదు. దొంగకు చిట్ట చివరి అవకాశం నిన్న రాత్రి మాత్రమే ఉన్నది. అందుచేత నిన్న మణుల మీద నా సొంత అత్తరు పూశాను. మరొకసారి దొంగతనం జరిగినా నేను తనను నిందించనని మాట ఇచ్చానన్న ధైర్యంతో నిన్న రాత్రి భద్రశీలి మరో పది మణులను అపహరించాడు; దొరికిపోయాడు," అన్నాడు రాజు.

తన నేరం ఇలా రుజువు అయేసరికి భద్రశీలి తాను దొంగిలించిన మణులను తెచ్చి ఇచ్చాడు.

మణుల దానం ఎప్పటిలాగే జరిగి పోయింది. రాజు భద్రశీలికి దేశబహిష్కరణ శిక్ష విధించాడు.





# పనికిమాలిన పనితనం

ఒక నగరంలో ఒక రాజు ఉండేవాడు. అతను తన రాజ్యంలో వృత్తి విద్యలు ప్రోత్సహించి ప్రజలకు సౌభాగ్యం సమకూర్చే ఉద్దేశంతో వివిధ వృత్తుల వారికి అప్పుడప్పుడూ బహుమతులు ఇస్తూండేవాడు. దేశంలోని వడ్రంగులూ, కమ్మరులూ, నేతగాళ్ళూ, కంసాలులూ, నగిషీ పని చేసేవాళ్లూ, శిల్పులూ, చిత్రకారులూ తాము తయారు చేసేవాటిలో శ్రేష్ఠమైనవి తీసుకుపోయి రాజుగారికి చూపేవారు. వాటిలో ప్రత్యేకమైన పనితనం కనిపించిన సందర్భాలలో రాజుగారు ఆ పనివారికి బహుమానాలు ఇస్తూండేవాడు.

ఆ రాజ్యంలోని ఒక గ్రామంలో ఉండే నేతగాడు ఒక చక్కని శాలువా ఒకటి నేసి, దానిని తీసుకుపోయి రాజుగారికి చూపాడు. రాజుగారు ఆ శాలువా పనితనాన్ని మెచ్చుకుని, దాన్ని వెల ఇచ్చి కొనటమే గాక నేతగాడికి మంచి బహుమానం కూడా ఇచ్చి పంపేశాడు.

అదే గ్రామంలో రామయ్య అనే వాడు ఉండేవాడు. వాడు చిల్లిపడిన పాత్రలకు మాట్లు వెయ్యటంలో నిపుణుడు. మాట్లు వెయ్యటమే వాడి వృత్తి. రాజుగారు అన్ని రకాల పనితనానికీ బహుమానాలు ఇస్తున్నాడు. మిగిలిన వృత్తుల వాళ్ళు సరికొత్త వస్తువులు తయారుచేసి తీసుకుపోయి రాజుగారికి చూపుతారు. వాటిలో పనితనం చూసి రాజుగారు బహుమానాలిస్తాడు. కాని తాను తన నైపుణ్యం రాజుగారికి చూపే అవకాశంలేదు!

ఇలా ఆలోచించిన మీదట రామయ్యకు ఒక ఉపాయం తట్టింది. రాజుగారు చూస్తూండగా తాను మాట్లువేసి, తన పనితనం చూపి, బహుమానం సంపాదించాలి. అందుకోసం రామయ్య

కె. రామకృష్ణారెడ్డి

ఊరంతా తిరిగి, అందరి ఇళ్ళనుంచీ మాట్లువేయవలసిన బిందెలూ, అండాలూ, గిన్నెలూ, చెంబులూ పోగుచేసి, వాటి నన్నిటినీ ఒక బండి మీద వేసుకుని, తిన్నగా రాజుగారి దివాణానికి వెళ్లాడు.

"ఎవరు నువు? నీకు ఏం కావాలి?" అని అడిగాడు రాజు.

"మహారాజా, తమరు అన్ని వృత్తుల వారికీ బహుమానాలు ఇచ్చి ప్రోత్సహిస్తున్నారు. నా వృత్తి మాట్లు వేయటం. నేను మాటు వేశానంటే చిల్లి ఎక్కడ ఉండినదీ కనుక్కోలేరు. నా పనితనం తమకు చూపాలని చాలాదూరం నుంచి వచ్చాను," అన్నాడు రామయ్య.

రాజు రామయ్య పనితనం చూడటానికి ఒప్పుకున్నాడు. రామయ్య రాజుగారు చూస్తుండగానే, కొన్ని పాత్రలకు చిల్లులు పెట్టి, మాట్లువేసి, మెరుగుపెట్టి, రాజుగారికి చూపాడు. చిల్లులు ఎక్కడ పెట్టినదీ తెలియలేదు. రాజుగారు వాడి పనితనాన్ని మెచ్చుకుని, మంచి బహుమానం ఇచ్చి పంపేశాడు. రామయ్య తన గ్రామానికి తిరిగిపోయి, ఎవరి పాత్రలు వారికి తిరిగి ఇచ్చేశాడు. గ్రామస్థులు తమ పాత్రలకు మాట్లు లేక పోవటంచూసి, "ఇదేమిటి, రామయ్యా? తీసుకున్న పాత్రలను తీసుకున్నట్టే ఇచ్చేశావు. బాగు చెయ్యలేదేం?" అని అడిగారు.

"నేను మీ పాత్రలను మాట్లు వెయ్యటానికి తీసుకున్నానా? నా పనితనం రాజుగారికి చూపటానికి తీసుకున్నాను. బహుమానం పొందాను. అంతే!" అన్నాడు రామయ్య.

గ్రామస్థులు వెళ్లి రాజుగారితో ఫిర్యాదు చేశారు. రాజుగారు రామయ్యను పిలిచి, "నీ పనితనంవల్ల ప్రజలకు లాభం కలగాలని నీకు బహుమానం ఇచ్చానుగాని, ప్రజలకు ఉపయోగించని పనితనానికి బహుమానం లేదు. దాన్ని తిరిగి ఇచ్చెయ్యి," అన్నాడు.

రామయ్య చెంపలు వేసుకుని, ప్రజల పని శ్రద్ధగా చెయ్యసాగాడు.





# గుణపాఠం

పూర్వం కోసలదేశాన్ని పాలించిన మాధవసేనుడు మూర్ఖుడు. ఆయన మంత్రి సుబుద్ధి దురాశాపరుడు. రాజు ఎవరికి ఎలాటి బహుమానం ఇయ్యదలచినా, మంత్రి అందుకు ఎన్నో ఆటంకాలు పెట్టేవాడు; ఏ ఆటంకమూ పనిచెయ్యక, దానం ఇచ్చితీరవలసిన పరిస్థితిలో మంత్రి ఆ దానం ఇచ్చే బాధ్యత తన మీదనే వేసుకుని, రాజు ఇయ్యమన్న మొత్తంలో ఏ నాలుగో వంతో ఇచ్చేవాడు. రాజుకు ఈ సంగతి తెలిసి కూడా ఏమీ చేయలేక పోయేవాడు.

ఒకనాడు రాజసభకు ఒక పండితుడు వచ్చి, తన విద్యా ప్రావీణ్యంతో రాజునూ, సభనూ మెప్పించాడు. ఆయనకు కలలను గురించి కూడా జ్ఞానం ఉన్నదట. ఆ సంగతి వినగానే అల్పసంతోషి అయిన రాజు మంత్రితో, "ఈ పండితుల వారికి నూరు బంగారు నాణాలు ఇప్పించండి," అన్నాడు.

ఈ మాట విని మంత్రికి చాలా కోపం వచ్చింది. సభలోకి వచ్చి నిలబడి నాలుగు పద్యాలు చదివినందుకు నూరు బంగారు నాణాలా? ఇలా అయితే కోశాగారం త్వరలోనే ఖాళీ అవుతుంది!

మంత్రి రాజుతో, "మహారాజా, పండితులవారు చదివినవన్నీ పాత పద్యాలే. ఈ పద్యాలు ఇంచుమించుగా అన్నీ మా తండ్రిగారు రచించి చనిపోయారు. పండితులవారు ఏదన్నా కొత్త పద్యం చెప్పి, తమ చేత సత్కారం పొందితే ఆయనకూ గౌరవంగా ఉంటుంది, తమకూ కీర్తి వస్తుంది," అన్నాడు.

సొంత ఆలోచన అంటూ ఏమీలేని మూర్ఖుడైన రాజు, "అవునవును! మంత్రి

భైరవరపు కేశవరావు



గారు చెప్పినది సబబుగానే ఉన్నది.'' అన్నాడు.

పండితుడికి నోటికి అందిన కూడు మట్టిపాలయినట్టయింది. ఇక తన కలల పాండిత్యం ప్రదర్శించినా మంత్రి ఎక్కి రానియ్యడని గ్రహించి ఆయన,'' చిత్తం, ప్రభూ! సెలవు ఇప్పించండి!'' అని సభనుంచి వెళ్ళిపోయాడు.

తరవాత పండితుడు మంత్రిగారిని గురించి కొంత తెలుసుకున్నాడు. మంత్రి గారి తండ్రి కూడా పేరుమోసిన కవే. ఆయన పోయి సంవత్సరం కావస్తున్నది. ఈ సంగతి తెలుసుకుని పండితుడు మర్నాడు మళ్ళీ రాజసభకు వచ్చాడు.

రాజు పండితుణ్ణి చూసి. '' మరల వచ్చారేం? '' అని అడిగాడు.

'' ఏలినవారు క్షమించాలి. నిన్న నేను చెప్పిన పద్యాలు మంత్రిగారి తండ్రి రచించినవే. ఆయన నిన్న రాత్రి నాకు కలలో కనిపించి, 'ఏమిరా, నా పద్యాలు అమ్ముకుని జీవించా లనుకుంటున్నావా ? అపరాధం కింద నూరు వెండ నాణాలు ఇచ్చుకో!' అన్నాడు. 'క్షమించండి, గురుదేవా! నేను మీకు ఆ సొమ్ము ఎలా అందించను?' అని అడిగాను. అందుకు ఆయన, 'నా కొడుకు నాకు తర్పణం విడిచేటప్పుడు వాటిని చేతిలో ఉంచు కుంటే చాలు, అవి నాకు చేరుతాయి,' అన్నాడు. మంత్రిగారు నన్ను అనుగ్ర హించి ఆ నాణాలు వారికి చేర్పించవల సిందని నా ప్రార్థన!'' అన్నాడు పండితుడు.

రాజుకు పండితుడి మాటలపై విశ్వాసం కుదిరింది. మంత్రి సుబుద్ధికి మటుకు పండితుడి తెలివి తక్కువ చూసి నవ్వు వచ్చింది. ఆయన పండి తుడి నుంచి నూరు వెండి నాణాలు సంతోషంగా పుచ్చుకున్నాడు.

కొంతకాలం జరిగింది. తిరిగి ఒక రోజున పండితుడు సభకు వచ్చాడు. రాజు పండితుణ్ణి చూసి, రహస్యంగా,

"మళ్ళీ ఏదైనా కలవచ్చిందా?" అని అడిగాడు.

పండితుడు బాధగా మొహం పెట్టి, మంత్రివైపు చూసి, రాజుతో, "అవును, మహారాజా! మరల కల వచ్చింది. మంత్రిగారి తండ్రిగారు కనిపించారు. ఆయన నా కేసి కోపంగాచూసి, 'ఏమిరా, అపరాధం చెల్లించావు కావు? శపించమంటావా?' అన్నారు. అందరూ చూస్తూండగానే నేను మంత్రిగారికి వెండి నాణాలు సమర్పించుకున్న సంగతి విన్నవించాను. కాని అవి ఆయనకు చేరలేదట! 'మా అబ్బాయిని స్వయంగా తెచ్చి ఇయ్యమను,' అన్నారాయన." అన్నాడు.

రాజు ఆశ్చర్యపోయి మంత్రి కేసి చూశాడు. మంత్రికి పచ్చి వెలగకాయ గొంతుకు అడ్డం పడ్డట్టయింది.

రాజు మంత్రిని, "డబ్బు మీ తండ్రిగారికి అందలేదట. మీరు దాన్ని తర్పణంలో విడవటం మరిచారా?" అని అడిగాడు.

మంత్రి నసుగుతూ, "తర్పణం విడిచాను, ప్రభూ!" అన్నాడు.

రాజు పండితుడి కేసి చూసి, "మంత్రిగారు స్వర్గం ఎలా వెళ్ళగలరు?" అని అడిగాడు.



"నాకూ అదే సందేహం వచ్చింది, ప్రభూ. ఆ సందేహాన్ని మంత్రిగారి తండ్రిగారే తీర్చారు; మంత్రిగారిని యజ్ఞపశువుగా చేసి మీ చేత యజ్ఞం చేయించమన్నారు. తొమ్మిదో రోజున మంత్రిగారు స్వర్గానికి ఎగరగలుగుతారట," అన్నాడు పండితుడు.

మంత్రికి ప్రాణాలు పైనే పోయినట్టయింది. మూర్ఖుడైన రాజు పండితుడి మాటలు నమ్మి, తనను యజ్ఞపశువుగా చేసి యజ్ఞం చేస్తాడు. తొమ్మిది రోజుల పాటు తనకు ఆహారమూ, నీళ్ళూ ఉండవు. తనను యూపస్తంభానికి కట్టి ఉంచుతారు. ఇదంతా పండితుడి కల్పన

అని చెప్పినా ఇప్పుడు రాజు నమ్మడు. పండితుడి ప్రభావం ఎటువంటిదో మంత్రికి ఇప్పుడు అర్థమయింది.

రాజు యజ్ఞానికి ఏర్పాట్లు చేశాడు. మంత్రికి పసుపు బట్టలు కట్టి ఒక స్తంభానికి బంధించారు. పండితుడు బ్రాహ్మణులను తెచ్చి మంత్రాలు చదివించుతూ యజ్ఞం సాగించాడు.

మొదటి రోజు గడిచేసరికే మంత్రి నీరసించిపోయాడు. నిలబడి ఉండటాన కాళ్ళు పీకుతున్నాయి. బంధాలకు చేతులు నొచ్చుతున్నాయి. రెండో రోజూ, మూడో రోజూ గడిచాయి. తాను బతికి ఉన్నదీ, లేనిదీ మంత్రికి తెలియటం లేదు. ఆ రాత్రి ఆయన పండితుణ్ణి రహస్యంగా తన వద్దకు పిలిపించి, ఏడుస్తూ, "బాబూ, నీకు నేను అన్యాయం చేశాను. రాజు నీకు ఇస్తానన్న డబ్బుతో బాటు అపరాధం కింద అయిదువందల వెండి నాణాలు కూడా ఇచ్చుకుంటాను. నన్ను రక్షించు," అన్నాడు.

"నువు ఎందరి పొట్టలో కొట్టావు. వాళ్ల ఉసురు నీకు తగిలి తీరాలి. తొమ్మిదో నాటికి గాని నీ పాపం పరిహారం కాదు," అన్నాడు పండితుడు.

"బాబూ, నాకు బుద్ధి వచ్చింది. నన్ను క్షమించు. ఇక ఎన్నడూ ఇలాటి దుర్మార్గపు పనులు చెయ్యను," అని మంత్రి ప్రాధేయపడ్డాడు.

పండితుడు రాజును కలిసి, "మహారాజా, మంత్రిగారి తండ్రి మరొకమారు కలలో కనిపించి, యజ్ఞంతోనే తనకు తృప్తి కలిగిందనీ, అపరాధం తనకు ముట్టినట్లే అనుకోమనీ, మంత్రిగారిని విడిచిపెట్టి యజ్ఞం అపుచేయించమనీ అన్నారు," అని చెప్పాడు.

రాజు తల ఊపుతూ, "సరే, అలాగే చేతాం!" అన్నాడు.

తరవాత మంత్రి పండితుడికి తాను ఇస్తానన్నదంతా ఇచ్చేశాడు. పండితుడు సంతోషించి, మరొక రాజ్యానికి తరలి వెళ్ళిపోయాడు.





# తృప్తిలేనివాడు

చాలాకాలం క్రితం చువాంగ్ రాష్ట్రంలో ఒక గొప్ప శిల్పి ఉండేవాడు. మంచి పనితనం కలవాడు కావటం చేత అతనికి గొప్ప పేరు ఉండేది.

ఒకనాడు ఒక సంపన్నుడు కొంత చెక్కడం పని చేయించుకో గోరి శిల్పిని పిలిపించాడు. శిల్పి వచ్చి చూసేసరికి అతనికి ఒక గొప్ప భవంతీ, సంపదా, నౌకర్లూ, చాకర్లూ కనిపించారు. అదంతా చూసే సరికి శిల్పికి కన్ను కుట్టింది. అతడు తన వృత్తి మానేసి, సంపదల్లో ఓలలాడాలని కోరుకున్నాడు.

అతని కోరిక గ్రహించి ఒక దేవత అతనికి అంతులేని సంపద ఇచ్చింది. శిల్పి పరమానంద భరితుడు అయ్యాడు.

కొంతకాలం గడిచింది. ఒకనాడు ఒక ప్రభుత్వోద్యోగి పర్యటన చేస్తూ, సపరివారంగా, మేనా కుర్చీలో బోయీల చేత మోయించుకుంటూ శిల్పి ఇంటి ముందుగా వచ్చాడు. అతనికి ఎదురైన వాళ్ళంతా వంగి, వంగి నమస్కారాలు చేస్తున్నారు. శిల్పి ధనమదంలో అధికారికి నమస్కారం చెయ్యలేదు. అందుకు అధికారి ఆగ్రహించి, శిల్పిని తనభృత్యుల చేత చావ చితక గొట్టించి, ముందుకు సాగిపోయాడు.

"ఉత్త డబ్బుండి చాలదన్నమాట! అధికారం కూడా ఉండాలి. నాకు పెద్ద అధికారి హోదా కావాలి!" అనుకున్నాడు శిల్పి.

దేవత అతన్ని అధికారి చేసేసింది. శిల్పికి ఇప్పుడు అధికారమదం పట్టుకున్నది.

ఒకనాకు శిల్పి తన అనుచరులతో పోయి, ఒక కొండ ప్రాంతంలో కొంత మంది అందమైన ఆడపిల్లలను చూసి,

చువాంగ్ జానపద కథ

వాళ్ళను పీడించబోయాడు. వాళ్లు కేకలు పెట్టేటప్పటికి అక్కడి కొండమనుషులు కర్రలూ, బరిసెలూ, గొడ్డళ్ళూ తెచ్చి, శిల్పి మీదా, అతని అనుచరుల మీదా పడి భీభత్సం చేశారు.

"ఛీ, ఛీ! ఈ గిరిజనుల ముందు ఏ అధికారీ నిలవలేడు. నేను ఈ గిరిజనులలో ఒకడుగా ఉంటాను," అనుకున్నాడు శిల్పి. దేవత అతన్ని గిరిజనుడుగా మార్చింది.

ఒకనాడు నడి ఎండాకాలంలో అతను పొలంలో ఉండగా ఎండ వేడికి తల తిరిగి పోసాగింది. ఒక కారు మేఘం వచ్చి సూర్యుణ్ణి కప్పేసింది. వెంటనే శిల్పి, "ఆహా, శక్తి అంటే ఈ మేఘానిది! నేను మేఘాన్ని అవుతాను," అనుకున్నాడు. మరుక్షణం దేవత అతన్ని మేఘంగా మార్చింది. అంతలోనే గాలి ఆ మేఘాన్ని ఎగరవేసుకు పోసాగింది.

"మేఘంగా ఉండటంకన్న గాలిగా ఉండటం ఇంకా గొప్ప!" అనుకున్నాడు శిల్పి. వెంటనే అతను గాలిగా మారి, ఆకాశాన విహరింపసాగాడు.

కొద్ది సేపటికల్లా ఆ గాలి వెళ్ళి ఒక కొండను ఢీకొన్నది. కొండ దాన్ని మరి కదలనియ్యలేదు.

"ఇంత గాలీ కొండకు లోకువే గద! నేను కొండను అవుతాను," అనుకున్నాడు శిల్పి. దేవత అతన్ని పెద్ద కొండరాయి చేసింది.

ఒకనాడు కొందరు శిల్పులు ఆ ప్రాంతానికి వచ్చి, రాయి రూపంలో ఉన్న శిల్పిని చూసి, "ఈ రాయి చాలా మేలైనది. దీన్ని పగలగొట్టి తీసుకుపోయి శిల్పాలు చేద్దాం!" అనుకున్నారు.

శిల్పి కంగారుపడి, "ఓ దేవతా, రక్షించు!" అన్నాడు.

"నువు శిల్పిగా ఉండటమే మంచిది," అంటూ దేవత అతనికి యథారూపం ఇచ్చేసింది. అటుతరవాత శిల్పి అసంతృప్తి విడిచిపెట్టి, శిల్పిగానే జీవిస్తూ, డబ్బూ, కీర్తీ గడించుకున్నాడు.






సీత జాడ తెలిసిన తరవాత రాముడికి ఒక్క క్షణం కూడా అక్కడ ఉండబుద్ధి పుట్టక, సీత ముందు వాలాలనిపించింది. ఆమె భయంకరమైన రాక్షస స్త్రీల మధ్య ఉన్నదంటేనే అతను భరించలేక పోయాడు. సీత హనుమంతుడితో ఏమేమి చెప్పిందో అది వింటూంటే రాముడికి ఎంతో ఆనందం కలిగింది. అందుచేత అతను హనుమంతుణ్ణి, ''సీత ఇంకా ఏమి చెప్పింది?'' అని అడిగాడు. హనుమంతుడు రాముడికి కాకికథ గురించి సీత చెప్పినదంతా వివరంగా చెప్పాడు.

''సీత ఈ వృత్తాంతం చెప్పి, 'అంత శక్తిగల రాముడు వచ్చి, ఈ రాక్షసుల మీద అస్త్రాలు ఎందుకు ప్రయోగించడు? రాముడికి నా మీద ఏ కొంచెం అనురాగం ఉన్నా, వెంటనే వచ్చి రావణుణ్ణి చంపమను. కనీసం నన్ను రక్షించటానికి రాముడు లక్ష్మణుణ్ణి అయినా పంపరాదా? దేవతలనైనా జయించగల ఆ ఇద్దరూ నన్నెందుకు ఇలా ఉపేక్షించి ఊరుకున్నారు? నేనేదో పాపం చేసుకుని ఉండాలి; అందుకే రామలక్ష్మణులు వచ్చి నన్ను చూడకుండా ఉన్నారు,' అన్నది. రామలక్ష్మణు లిద్దరూ ఆమె కోసం పుట్టెడు దుఃఖంలో ఉన్నారని నేను ఆమెకు చెప్పాను. ఇంక ఆమె కష్టాలు తీరిపోతాయనీ, ఆమె దుఃఖించనవసరం లేదనీ కూడా ఆమెతో అన్నాను. ఆమె బెదిరి అన్ని దిక్కులూ చూసి, తన



జడలో ఉన్న చూడామణి తీసి నా చేతికి ఇచ్చింది; మీ అందరి క్షేమమూ అడిగి నట్టు చెప్పమన్నది. రామలక్ష్మణులూ, సుగ్రీవుడి బలాలూ వచ్చి, రావణుణ్ణి చంపేస్తారని ఆమెకు ధైర్యం చెప్పి, వచ్చేశాను,'' అన్నాడు హనుమంతుడు.

హనుమంతుడు చెప్పిన మాటలకు రాముడు పరమానందం చెంది, ''ఈ హను మంతుడు చాలా గొప్పపని చేశాడు. ఇలాంటి పని మరొకరికి సాధ్యం కాదు. సముద్రాన్ని దాటగలవాళ్ళు ఈ హను మంతుడి తరవాత గరుత్మంతుడూ, వాయుదేవుడూ మాత్రమే ననుకుంటాను. లంకలో ప్రవేశించి ప్రాణాలతో బయట పడటం మాత్రం మాటలా? మొదట ప్రవేశించటమే మరొకడికి సాధ్యం కాదు! హనుమంతుడు సుగ్రీవుడి ఆజ్ఞలను మాత్రమే నిర్వర్తించక, స్వతంత్రించి, అశోకవనం ధ్వంసం చెయ్యటమూ, రాక్షసులను చంపటమూ, లంకను తగలబెట్టటమూ మొదలైన సాహసకార్యాలు కూడా చేశాడు. ఇలాచేసి అతను సుగ్రీవుడికి అధికమైన సంతోషం కలిగించాడు. ఇతను చేసిన పని మా రఘువంశాని కంతటికీ మేలు కలిగించింది. కాకపోతే, ఈ హనుమంతుడికి తగిన సత్కారం చేయలేని స్థితిలో ఉన్నానే అని నేను బాధపడుతున్నాను. నా ప్రాణాలూ, సీత ప్రాణాలూ కాపాడిన హనుమంతుడి ఋణం ఏమిస్తే తీరుతుంది? ఒక్కసారి అతన్ని ఆలింగనం చేసుకుంటాను,'' అంటూ హనుమంతుణ్ణి గాఢాలింగనం చేసుకున్నాడు.

తరవాత రాముడు కొంచెం ఆలోచించి, ''వానరసేనలు సముద్రాన్ని దాటి, అవతలి గట్టు చేరేది ఎలా? ఆ మాట తలుచుకుంటేనే నాకు భయంగా ఉన్నది. సీతాదేవికి ధైర్యం చెప్పినట్టు కాదు; సముద్రాన్ని దాటే ఉపాయమేమిటి?'' అంటూ హనుమంతుణ్ణి చూసి విచారంలో పడ్డాడు.

అప్పుడు సుగ్రీవుడు ఇలా అన్నాడు:

"రాముడా, ఎందుకు విచారిస్తావు? సీతాదేవి ఉన్నచోటూ, శత్రువు ఉన్న చోటూ తెలిసినమీదట మిగిలిన సమస్యలు ఏవీ శత్రువును చంపటానికి అడ్డంరావు. మనం సముద్రానికి సేతువు కట్టుదాం; రావణుణ్ణి చంపి, సీతాదేవిని తీసుకు వద్దాం. సేతువు కట్టి, లంకానగరం మన కంటపడగానే రావణుడు చచ్చినవాడి కింద జమ! ఇప్పుడు నీకు కలగదగినది విచారం కాదు, క్రోధం. సముద్రం ఎలా దాటాలన్నది మాతోబాటు నువు కూడా ఆలోచించు. సేతువు కాకపోతే మరో మార్గంగానయినా సముద్రాన్ని దాటి తీరుతాం. రావణుడు చచ్చితీరుతాడు. నీకు జయం కలిగి తీరుతుంది."

రాముడు హనుమంతుడి కేసి తిరిగి, "సముద్రాన్ని సేతువు కట్టిగాని, సముద్రాన్ని ఎండగట్టిగాని, తపస్సు చేసిగాని ఏదోవిధంగా సముద్రాన్ని దాటవచ్చుననుకుందాం. పోతే, లంకానగరానికి ఎన్ని దుర్గాలున్నాయి? సైన్యం ఏపాటి ఉన్నది? ద్వారరక్షణ ఏ విధమైనది? ప్రాకారాలూ మొదలైనవి ఎలా ఏర్పాటు అయి ఉన్నాయి? ప్రత్యక్షంగా చూసి ఉన్నావు గనక నాకు వివరించి చెప్పు!" అని అడిగాడు.



హనుమంతుడు రాముడికి ఇలా చెప్పాడు:

"లంకా నగరం మహా విశాలమైనది. అక్కడ అసంఖ్యాకులైన రాక్షసులు సుఖ సంతోషాలతో ఉన్నారు. ఎక్కడ చూసినా రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ కనిపిస్తాయి. లంకలోకి శత్రువు ప్రవేశించటం అసాధ్యం. నగరానికి నాలుగు ద్వారాలున్నాయి; వాటికి పెద్దవీ, దృఢమైనవీ అయిన తలుపులు ఉన్నాయి. ద్వారాల వద్ద పెద్ద పెద్ద యంత్రాలు, బాణాలనూ, శిలలనూ ప్రయోగించేవి ఉన్నాయి; శత్రుసైన్యం అటుగా వస్తే ఆ యంత్రాలు దాన్ని నాశనం చెయ్యగలవు. ద్వారాల



వద్ద మహాశూరులైన రాక్షసులు ఉంటారు. వారి వద్ద ఉండే ఇనుప పరిఘలు ఒక్క దెబ్బన నూరుమందిని చంపగలవు. నగరం చుట్టూ బంగారపు ప్రాకారం ఉన్నది; దాని మీద అక్కడక్కడా రత్నాలు పొదిగి, అందంగా ఉన్న భాగాలున్నాయి. ఆ ప్రాకారాన్ని దాటటం సాధ్యంకాదు. ప్రాకారంచుట్టూ లోతయిన అగడ్త లున్నాయి; వాటిలో భయంకరమైన మొసళ్ళూ, చేపలూ ఉన్నాయి. ప్రతి ద్వారం వద్దా అగడ్తకు వంతెనలు ఉన్నాయి; వాటిని ఎత్తవచ్చు, దించవచ్చు; వాటిని అవసరాన్నిబట్టి ఎత్తటానికీ, దించటానికీ పెద్ద యంత్రాలున్నాయి.

రావణుడు చాలా జాగ్రత్త గలవాడు; యుద్ధం లేనప్పుడు కూడా తన సేనలను మంచి శిక్షణలో ఉంచుతాడు. అదీగాక, లంకానగరం త్రికూట పర్వతం మీద ఉన్నది. కిందినుంచి పైకి వెళ్ళేటందుకు మార్గం లేదు. లంకకు పోవటానికి ఓడ మార్గంలేదు. అందుచేత అక్కడి వార్తలు బయటి ప్రపంచానికి అందవు. లంకానగర ద్వారాల వద్ద లక్షల సంఖ్యలో సాయుధులైన రాక్షసులు ఉంటారు. నగర మధ్యంలో లెక్కకు మించిన రాక్షససేన ఉన్నది. అయితే నేను అగడ్తల మీది వంతెనలను పగలగొట్టాను; లంకానగరం తగలబెట్టాను; కొందరు రాక్షస వీరులను చంపాను. అందుచేత లంకకు ఇప్పుడు అంత బలం లేదు. సముద్రాన్ని ఎలా దాటినా దాటవచ్చు. లంకను జయించటానికి మన అంగదుడూ, ద్వివిదుడూ, మైందుడూ, జాంబవంతుడూ, బనసుడూ, మన సేనానాయకుడైన నీలుడూ చాలు. వెంటనే మంచి ముహూర్తం నిశ్చయించి బయలుదేరవచ్చు.''

రాముడు సుగ్రీవుడితో, ''మనం ఇప్పుడే ప్రయాణమవుదాం. సూర్యుడు నడినెత్తిన ఉన్నాడు. ఈ అభిజిత్తు అనే ముహూర్తం చాలా మంచిది,'' అన్నాడు.

సేనల గమనం ఎలా ఉండవలసిందీ అతను వివరంగా చెప్పాడు. సేనానాయకుడైన నీలుడు తన బలగంతో ఫలసమృద్ధి గల మార్గాలకుండా సేనను నడిపించాలి. శత్రువులు ముందుగా ఆ ప్రదేశాలను ధ్వంసం చెయ్యకుండానూ, వాళ్లు పల్లపు ప్రదేశాలలో మాటువేసి ఉండి అకస్మాత్తుగా మీదపడకుండానూ జాగ్రత్త పడాలి. సేనలు నడవబోయే మార్గాలను ఆకాశమార్గాన ముందుగా వెళ్ళి, తెలుసుకోవాలి. తక్కువ పరాక్రమవంతులు దిగబడిపోయి, మంచియోధులు మాత్రమే బయలుదేరాలి.



రాముడి వెంట వానరసేన బయలుదేరింది. మహాకాయుడైన గజుడూ, మహాబలులైన గవయుడూ, గవాక్షుడూ సేనకు ముందుండి నడిచారు. ఎగరటంలో గొప్పవాడైన ఋషభుడు సేనయొక్క కుడి పార్శ్వాన్ని రక్షించాడు; గంధమాదనుడు ఎడమ పార్శ్వాన్ని రక్షించాడు. సైన్యం మధ్యలో రాముడు హనుమంతుడి భుజాల మీద ఎక్కి కదిలాడు. అలాగే లక్ష్మణుడు అంగదుడి భుజాల మీద ఎక్కాడు. సైన్యం దక్షిణంగా బయలుదేరింది. వానరులు ఎగురుతూ, గెంతుతూ, సింహనాదాలు చేస్తూ, దారిలో కనిపించిన ఫలాలు కోసి తింటూ నడిచారు.

మహాసముద్రం లాగా కనిపించే ఆ వానరసేన కొండలూ, సరస్సులూ దాటుతూ, అరణ్యాలలో పళ్ళుతింటూ, తేనెలుతాగుతూ, కాలక్రమాన మహేంద్ర పర్వతాన్ని చేరింది.

రాముడు పర్వత శిఖరం మీద ఎక్కి సముద్రాన్ని చూశాడు. తరవాత అతను సుగ్రీవుడితోనూ, లక్ష్మణుడితోనూ కిందికి దిగివచ్చి, సముద్రతీరానికి చేరిన వానర సేనల వద్దకు వచ్చాడు. అతను సుగ్రీవుడితో, "మనం ఇక్కడ మజిలీ చేసి, ఈ సముద్రాన్ని దాటే ఆలోచన చెయ్యాలి. ఇందుకు కాలం పడుతుంది. ఎవరినీ సేనను విడిచి పోనియ్యకు. శత్రుభయం



లేకుండా సేనకంతకూ గట్టికాపలా ఏర్పాటు చెయ్యి.'' అన్నాడు.

వానరసేన మూడు భాగాలుగా చీలి సముద్రతీరాన విడిసింది.

అవతలి తీరం కానరాని ఆ మహా సముద్రాన్నీ, అందులో లేచే భయంకరమైన కెరటాలనూ, అందులో ఉండే భయంకరమైన ప్రాణులనూ తలచుకుని, వానరవీరులు, ''దీన్ని ఎలా దాటటం?'' అని తమలోతాము దిగులుపడ్డారు.

అక్కడ లంకలో హనుమంతుడి మూలంగా రావణుడికి తీరని పరాభవం జరిగింది. శత్రువులు ప్రవేశించరాని లంకలోకి ఒక కోతి సునాయాసంగా ప్రవేశించి, సీతను చూసింది; చైత్య ప్రాసాదాలు పగలగొట్టింది; అనేక మంది రాక్షసయోధులను చంపింది.

రావణుడు సభలో ఈ మాట చెప్పి, ''ఇప్పుడు మనం ఏం చెయ్యాలి? మనకు మేలు కలిగే ఉపాయం ఏమిటి?'' అని అడిగాడు.

రాముడు పెద్ద వానరసేనతో లంక మీదికి వస్తున్నాడని లంకలో తెలిసింది. రాముడి సేనలు సముద్రాన్ని దాటుతా యన్నది కూడా రావణుడు నమ్మాడు. తన సేనకూ, వానరసేనకూ మధ్య యుద్ధం జరిగితే తన పట్టణానికీ, సేనకూ అపాయం కలగకుండా ఉండే మార్గం అతను తెలుసుకోగోరాడు.

ఆలోచనలేని రాక్షసులు, ''రాజా, మనకు అంతులేని సేన ఉన్నది. అద్భుతమైన ఆయుధాలు ఉన్నాయి. ఎందుకు విచారం?'' అన్నారు; అతను లోగడ సాధించిన ఘనవిజయాలను గురించి మాట్లాడారు. శివుడి స్నేహంగల కుబేరుణ్ణే రావణుడు జయించాడు; పాతాళంలో మహా సర్పాలు అతనికి ఓడారు. అతనికి ఓడని రాజు లేడు. ఈ రాముడు ఏపాటి? వానరుల మాటకు వస్తే ఇంద్రజిత్తు ఒక్కడే వానరుల నందరినీ నాశనం చెయ్యగలడు.

ప్రహస్తుడు రావణుడితో, ''రాజా, నీకు దేవ, దానవ, గంధర్వులూ, పిశాచాలూ ఎదురు నిలవలేవు; కోతులనగా ఎంత? మనం అజాగ్రత్తగా ఉన్న సమయంలో హనుమంతుడు వచ్చి ఇంత చెయ్యగలిగాడు గాని, లేకపోతే వాడు ప్రాణాలతో ఇక్కడినుంచి పోగలిగి ఉండునా? నీ ఆజ్ఞ అయితే నేను వెళ్ళి భూప్రపంచంలో ఉన్న వానరుల నందరినీ చంపి, సృష్టిలో వానరుడనేవాడు లేకుండా చేస్తాను.'' అన్నాడు.

దుర్ముఖుడనే రాకసుడు కూడా తాను వెంటనే వెళ్ళి వానరుల నందరినీ చంపుతాననీ, హనుమంతుడు చేసిన పని రాకసులకూ, ప్రత్యేకించి రావణుడికీ ఎంతో అవమానమనీ అన్నాడు. వజ్రదంష్ట్రుడనే రాకసుడు కూడా తాను ఒక్కడే వెళ్ళి, వానరులతోబాటు రామ, లక్ష్మణ, సుగ్రీవులను కూడా చంపేస్తానన్నాడు. చంపటానికి వాడి చేతిలో పరిఘ ఒకటి సిద్ధంగానే ఉన్నది.

వాడు ఇంకో ఉపాయం కూడా చెప్పాడు. అదేమిటంటే, కామరూపులైన రాకసులు మనుష్య రూపాలు ధరించి, అనేక వేల సంఖ్యలో రాముడి వద్దకు వెళ్ళి, తమను భరతుడు పంపించాడనీ, తమ వెనకగా భరతుడు పంపిన సేన వస్తున్నదనీ చెప్పాలి. అప్పుడు లంకలో నుంచి రాకససేన వెళ్ళి, ఆకాశం నుంచి రాళ్ళూ, రప్పలూ కురిపించి, వానరసేనను చంపెయ్యాలి! తరవాత రామలక్ష్మణులు గుండెలు పగిలి చస్తారు!

"నేను ఒక్కణ్ణేపోయి రామ, లక్ష్మణ, సుగ్రీవ, హనుమంతులను చంపేసి, చక్కావస్తాను.'' అన్నాడు నికుంభుడు. వాడు కుంభకర్ణుడి కొడుకు. వజ్రహనుడనేవాడు తాను వెళ్ళి వానరులనందరినీ తినేస్తా నన్నాడు. ఆ మాట తలుచుకుంటేనే వాడికి నోరు ఊరింది.

మొత్తం మీద రాకస వీరులందరూ లేచి, రకరకాల ఆయుధాలు ఎత్తిపట్టుకుని యుద్ధానికి సిద్ధమయ్యారు.






యో హి భృత్యో నియుక్తస్సన్
భర్త్రా కర్మణి దుష్కరే,
కుర్యా త్తదానురాగేణ
త మాహుః పురుషోత్తమం. 1

[తన యజమాని చెప్పిన కఠినకార్యాన్ని నెరవేర్చటమేగాక, దానికి సంబంధించిన పనులు కూడా విజయవంతంగా చేసేవాడు ఉత్తమ భృత్యుడు.]

నియుక్తో యః పరం కార్యం
న కుర్యా న్నృపతేః ప్రియమ్,
భృత్యో యుక్త స్సమర్థశ్చ
త మాహు ర్మధ్యమం నరం. 2

[ఉత్సాహమూ, సమర్థతా ఉండి కూడా, యజమాని చెప్పిన పని మాత్రమే చేసి, ఇంకేమీ చెయ్యనివాడు మధ్యమ భృత్యుడు.]

నియుక్తో నృపతేః కార్యం
న కుర్యా ద్య స్సమాహితః,
భృత్యో యుక్త స్సమర్థశ్చ
త మాహుః పురుషాధమం. 3

[ఉత్సాహమూ, సమర్థతా ఉండి కూడా యజమాని చెప్పిన పని కూడా చేయనివాడు అధమ భృత్యుడు.]

భృత్యులు

Photo by S. B. Takalkar



బహుమతి
పొందిన వ్యాఖ్య

రాబోయే కాలానికి

పంపినవారు :
ఎం. మల్లారెడ్డి

 Photo by Bal. Pawaskar



మెట్‌పల్లి.
(కరీంనగర్ జిల్లా)

కాబోయే సిపాయిని

బహుమతి
పొందిన వ్యాఖ్య

## ఫోటో వ్యాఖ్యల పోటీ :: బహుమానం రు. 20 లు





* వ్యాఖ్యలు మార్చి 20వ తేదీలోగా చేరాలి. వ్యాఖ్యలు పోస్టుకార్డుపైనమాత్రమే రాయాలి.
* వ్యాఖ్యలు ఒక్కమాటలో గాని, చిన్న వాక్యంలో గాని వుండాలి. రెండు వ్యాఖ్యలకూ సంబంధం వుండాలి. గెలుపొందిన వ్యాఖ్యలు మే నెల సంచికలో ప్రకటించబడును.

# చందమామ

### ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు



రెండవ అట్ట:
ఉత్సవానికి

మూడవ అట్ట:
ఊరేగింపుకు

Printed by B. V. REDDI at Prasad Process Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 2 & 3, Arcot Road, Madras 600 026 : Controlling Editor : NAGI REDDI

సత్యచిత్ర సమర్పించు

# ప్రేమబంధం

ఈస్ట్‌మన్ కలర్

దర్శకత్వం:
**కె.విశ్వనాథ్**

నిర్మాతలు:
**సత్యనారాయణ**
**సూర్యనారాయణ**

సంగీతం: కె.వి.మహదేవన్

ఫొటోగ్రఫీ: జి.కె.రాము







సోల్ డిస్ట్రిబ్యూటర్స్:
లక్ష్మీకంబైన్స్

విడుదల:
లక్ష్మీ ఫిలింస్

65

59



విజయా వారి

# శ్రీ రాజేశ్వరీ విలాస్ కాఫీక్లబ్

ఈస్ట్మన్ కలర్

నిర్మాతలు:
నాగిరెడ్డి-చక్రపాణి

సంచాలకుడు:
చక్రపాణి

సహకారం:
బాపు

విజయా రిలీజ్

*Photo by:* **J. S. PAREEK**



READY FOR THE DANCE

